# దైవశాసనం



అరుణోదయకాలం ఆసన్నమైంది.

దివ్యానందస్వామి ఇంకా వాహినీ గట్టుపైనే అకుంఠిత దీక్షను కొనసాగిస్తూ వున్నాడు.

ఆ రోజు ప్రకృతిలో వికృతి చెలరేగింది. పెనుతుఫాను ఆరంభమయ్యింది. వరద వరవళ్ళు తొక్కుతూ వస్తూంది. వాయువేగం చెలరేగింది- వర్షం ఉధృతమయ్యింది.

ప్రకృతి తాకిడికి నదులన్నీ పొంగి పొర్లుతూ అక్రమ మార్గంలో విచ్చలవిడిగా విజృంభించాయి. భరించరాని పెనుగాలుల తాకిడికి 'పెళపెళ' మంటూ వృక్షాలు నేల కూలాయి. జంతువులు బిక్కుబిక్కుమంటూ తల దాచు కోవాలని కొండ బొరియల్లోకి వెళ్ళాయి. ఊహించని విధంగా కొండ అంచులు విరిగి సజీవంగా వుండే వన్య మృగసంపద నిర్జీవంగా మారిపోయింది.

అప్పటికే దివ్యానంద స్వాములవారి ఆశ్రమంలో

కల్లోలం చెలరేగింది. చెట్లు నేల కూలిన కారణంగా కొందరు ఆశ్రమవాసుల ప్రాణాలు గగన విహారం చేశాయి. మరికొందరు కాళ్ళూ, చేతులూ, తలలూ విరిగి రక్తసిక్తమైన దేహాలతో నేలపై దొర్లుతూ మృత్యుగీతాలనాలపిస్తున్నారు.

దానికితోడు వరద విపరీతమైన వేగంతో వచ్చింది. ఆశ్రమంలోని వారంతా పరుగులు తీశారు. వారి కళ్ళముందే కన్నకొడుకులూ, బంధువులూ, భార్యలూ వరదపాలయ్యారు. కుటీరాలన్నీ నేలకూలాయి. వరదలో తెప్పల్లా కొట్టుకుపోతున్నాయి. వృద్ధులు నీటిలో మునిగి మృతులయ్యారు. మునికన్యలూ, ముని స్త్రీలూ ఇంకా ఎందరెందరో చెలరేగిన నదిప్రవాహంలో కొట్టుకుపోతూ ఆర్తనాదాలు చేస్తున్నారు.

ఆ ఆక్రందనలూ, మృత్యు శోకాలూ దివ్యానంద స్వాములవారికి వినిపించాయి. ఆవేశం పొంగింది. కళ్ళు తెరిచి చూశాడు. తన చుట్టూ వూహించనంత వేగంతో వరద ప్రవహిస్తూ వుంది. తను ఎత్తయిన గుట్టపై వున్నాడు. చెట్లు కనిపించడం లేదాయనకు. ఎటు చూసినా అరవై అడుగుల ఎత్తులో నీరు ప్రవహిస్తూ వుంది.

అంత ఎత్తులో నీరు ప్రవహిస్తుంటే ఆయన ఆశ్రమం ఎలా కనిపిస్తుంది! ఆయన గుండెల్లో వ్యధ సుడులు తిరుగుతుంది. తన ఆశ్రమవాసులంతా నీటిమయమై మృతులయ్యారని తెలుసుకున్నాడు. ఆయన అంతరంగంలో తీరని ఆవేదనతోబాటు ఆక్రోశం చెలరేగింది. ఉక్రోషంతో శరీరం నిప్పుకణంలా మండిపోతుంది.



వెంటనే తను మంత్రజలాన్ని తీసుకొని "ఎంతటి అహంకారం? ఎంత సాహసం. నా ఆశ్రమవాసులను పొట్టన బెట్టుకునే హక్కూ అధికారాలను ఎవరిచ్చారీ గంగాదేవికి?" వెంటనే ఆ మంత్రజలాన్ని నదిలోకి విసిరాడు. చూస్తుండగనే నదిలోని నీరంతా ఇంకిపోయింది. ప్రవాహవేగం పూర్తిగా తగ్గిపోయింది.

వరదంతా వెనక్కు మరలింది. అయినా, దివ్యానంద స్వామిలో ఆవేశం చల్లారలేదు. తన ఆశ్రమం ఉన్న ప్రాంతమంతా శూన్యంగా వుంది. చిక్కని బురదతో అసహ్యంగా కనిపిస్తుంది. "గంగా!" ఆకాశం విరిగిపడేలా అరిచాడు.

భూమి కంపించింది. ఆకాశంలోంచి ఉరుములూ, మెరుపులూ ప్రారంభమయ్యాయి. ముల్లోకాలలో అంధకారం వ్యాపించింది. కొండలు పిండై పోతున్నాయి.

గంగాదేవి అతని ఎదుట ప్రత్యక్షమయ్యింది.

"ఏమిటి నీ వికృత రూపం? సాధుజంతువుల్లాంటి అమాయకులైన నా ఆశ్రమవాసులు నీకే పాపం చేశారు? నిత్యం నిన్ను పవిత్రంగా ధ్యానించి స్నానం చేస్తున్నవారిని కర్కశంగా ఎందుకు కాటు వేశావు?" ఆవేశంతో పలికాడు.

"సమాధానం తెలిసి కూడా నన్నెందుకు ప్రశ్నిస్తున్నారో అర్థం కావడంలేదు. ప్రకృతిలో ఇలాంటివి సర్వసాధారణం నాలో చెలరేగిన ఆనందానికి చిహ్నం. నా ఆనందం మీ కారణంగా నాశనమయినందులకు విచారించాల్సింది నిజంగా నేనే. మీ రెందుకు బాధపడుతున్నారో అవగాహన కావటం లేదు" శ్రావ్యకంఠంతో పలికిందామె.

"హా! నీ ఆనందానికి నా ఆశ్రమవాసుల ప్రాణాలే బలికావాలా? ఈ ఆశ్రమం నాది. ఇదెంతో పరమ పవిత్రమైంది. ఇక్కడకు రావడానికి నీ కెంత ధైర్యం? నీవు నీ ఆనందాన్ని పోగొట్టుకున్నావనే బాధలో వున్నావు. నీ ఆనందం తీర్చడానికి నా ఆత్మీయులెందరో బలయిపోయినందుకు నేనెంత వగకు లోనుకావాలి! జలప్రళయం సృష్టించి, రాక్షసత్వంతో ప్రవర్తించినందుకు ఎందరెందరు నాశనమయ్యారో తెలుసా? నీవు పొంగి పొర్లాలంటే ఈ సువిశాల కారడవిలో నీకు తావే కనిపించలేదా? ఏ పాపం తెలీని వన్యమృగాలూ ఆ వన్యమృగాల కంటే సున్నిత హృదయులైన నా శిష్యబృందమే నీకవసరమయ్యిందా? నీవు పొందలేని ఆనందాన్ని ఏ క్షణాన్నయినా పొందగలవు. ఇప్పుడు మృతులయిన వారందరూ సజీవులుగా నాకు కనిపించాలి" దృఢనిశ్చయంతో పలికాడు.

"కనిపించకపోతే?" ఎదురుప్రశ్న వేసింది సూటిగా చూస్తూ.

"నిన్ను సర్వనాశనం చేస్తాను" అన్నాడు కఠినంగా.

ఆమె వికృతంగా నవ్వింది. "నన్ను నాశనం చేయడం ఎవ్వరి తరమూకాదు. నేనులేకుంటే ఆకలి దప్పికలు తీరక అలమటిస్తారు. చివరికి ఈ భూప్రపంచంలో సజీవంగా ఎవ్వరూ వుండరు. మీరు కూడా నన్నే అర్థించే స్థితికి వస్తారు. మీరు నన్నేమీ చేయలేరు" అంది గర్వముగా. 'రియ్యి'న చెలరేగింది గాలి. ఆ వాయు తరంగాలకామె కురులు సాగర కెరటాల్లా తుళ్ళింతలాడుతున్నాయి.



"గంగా! ఏమిటి నీ గర్వం? నిన్నీ క్షణమే శిలగా మార్చుతున్నాను- కఠిన పాషాణ హృదయంతో ప్రవర్తించిన నిన్ను నేను క్షమించను- శాపఫలాన్ని వెంటనే అనుభవించు" అంటూ మంత్రజలాన్ని ఆమెపై చల్లాడు-ఆమె శిలగా మారింది.

అంతే! ఎక్కడో 'ఫెళఫెళ' మంటూ పిడుగులు పడుతున్నాయి. లోకంలోని జలమంతా శిలగా మారిపోయింది! సృష్టికార్యం స్తంభించిపోయింది. జంతువులూ, మనుష్యులూ సకల ప్రాణులూ జలంకోసం తల్లడిల్లిపోతూ కన్ను మూశాయి. మధ్యాహ్న వేళకే అరాచకం అధికమయ్యింది- దాహపు చావులు ప్రతిక్షణం అధికమయ్యాయి.

నాగాభరణుడు గంగలేక పోయేసరికి భరించలేక పోతున్నాడు. ఆలోటు ఆయన అంతరంగాన్ని క్షోభకు గురిచేస్తోంది. పార్వతీదేవికి ఆగ్రహం కలిగింది- శివతాండవం మొదలయింది- పార్వతీదేవికూడ ఆ నృత్యంలో పాల్గొన్నది సకల లోకాలన్నీ కంపించిపోతున్నాయి—

అప్పటికే అన్ని లోకాల్లో విపరీతమైన ప్రాణనష్టం వాటిల్లింది. సృష్టికర్తకూ అయోమయంగా తోచింది-హరిభక్తుడు దివ్యానందుడు పరమశివుడి కోపాగ్నులకు బలైపోతాడేమోననే యోచన కలిగింది. వెంటనే వైకుంఠానికి వెళ్ళి ఆ విషయాన్ని వైకుంఠుడికి తెలియజేశాడు—

విష్ణుమూర్తి వెంటనే దివ్యానందుణ్ని చేరుకున్నాడు. "భక్తా! నీ యోచన నాకు తెలియనిదికాదు. పవిత్రమైన గంగాదేవిని శిలగాచేస్తే సప్త లోకాలూ చలన రహితంగా ఉండిపోతాయి- కొందరి కారణంగా సృష్టికే తీరని నష్టం

జరగడం ఉచితంకాదు. నీవు కోల్పోయిన నీ ఆశ్రమ వాసులను ఇప్పుడే సజీవులను చేస్తాను. నీ శాపాన్ని ఉపసంహరించుకుని శాంతించకపోతే జరిగే ఘోరాలెంత భయంకరంగా వుంటాయో నీకు తెలియనిదికాదు" ప్రశాంత స్వరంతో పలికాడు.

దివ్యానందుడు శాంతించాడు, విష్ణువు మాటలకు. వెంటనే తన శాపాన్ని ఉపసంహరించుకున్నాడు. గంగాదేవి పరమేశ్వరుడి సన్నిధికి చేరుకుంది. ఆమె ఆత్మ అవమాన భారంతో దహించుకుపోతుంది.

మల్లికార్జునుడి మనసు శాంతించింది___

మరణించిన ఆశ్రమవాసులూ, వన్యమృగాలూ, సకల జీవులూ పునర్జన్మను పొందాయి. దివ్యానందుడికి ఆశ్రమాన్నికూడ సృష్టించి అంతర్ధానమయ్యాడు విష్ణు భగవానుడు___

ఆశ్రమవాసులంతా దివ్యానందుడి పాదాలపై పడి నమస్కరించారు. దివ్యానందుడెంతో ఆనందభరితుడయ్యాడు.

o o o

గంగాదేవి నందివాహనుడిపై అలుకను ప్రదర్శించింది. ఆయన ఆమెనెన్నో విధాలుగా ఓదార్చే ప్రయత్నం చేశాడు. కానీ, ఆమెపట్టిన పంతాన్ని వీడలేదు. దివ్యానందుడ్ని ఎలాగైనా తన పాదాల చెంతకు రప్పించుకోవాలి! అతన్ని అవమానాగ్నులకు బలి చేయాలి! ఆతడ్ని అష్టకష్టాలపాలు చేయాలి!

"ప్రాణనాథా! ఓ సామాన్యముని పుంగవుడు గంగా



దేవినే శపించడం. శాపించడం మీకు మాత్రం అవమానకరంగాలేదా!" అంది చిరుకోపంతో.

"దివ్యానందుడు సామాన్యుడుకాదు. మహా తపస్వి. అంతేకాదు, అతను గొప్ప హరిభక్తుడు. భక్తులను శపించడం, వారిని సర్వనాశనం చేయడం దైవత్వం అనిపించుకోదు. అందుకే నందుడ్ని క్షమించాల్సి వచ్చింది. అయినా అతను ఆగ్రహించడంలో యదార్థం లేకపోలేదు. అతను తన కోసం ఆగ్రహించలేదు. తన వారికోసం పట్టుదలతో అలా ప్రవర్తించాడు" ప్రశాంత వదనంతో ఆమెను చూశాడు.

"హు! అతడ్ని మీరు కూడా సమర్థిస్తున్నారా? ప్రకృతి ధర్మంగా నేను ఆనందించే యోగ్యతే నాకు లేదా! ఏ యుగంలో నన్ను ఎదిరించి, శపించిన వారేలేరు. ఈనాడు! నందుడి కారణంగా అవమానించబడిన నన్ను చూసి జాలిపడేవారు లేరు" దుఃఖాన్ని ప్రదర్శించిందామె.

"కలియుగంలోని సకల ప్రాణులనూ కాపాడే తల్లివి నీవు! అలాంటి నువ్వు ఆ బిడ్డలను సంహరించడం తగదు దేవీ! దివ్యానందుడు కూడా మనకు పుత్రసమానుడు. బిడ్డలను ఆగ్రహించి. సర్వనాశనం చేయడం ఏ తల్లికీ మనస్కరించదు. ఇంకా నీలోని వేదన అలాగే వుంటే నందుడితో క్షమార్పణ చెప్పిస్తాను. ఆగ్రహం మాని యిహనైనా ఆనందంగా వుండు" అన్నాడు శ్రావ్య స్వరంతో పరమశివుడు

"నందుడు క్షమాభిక్ష వేడుకునే వరకూ నా మనసుకు శాంతి శూన్యం" అంది గంగాదేవి బరువు స్వరంతో

"నీలో రగిలేది ఆనందమో ఆగ్రహమో అవగాహన కావడంలేదు దేవీ! ప్రతి ఏటా జలప్రళయంలో ఎన్నివేల ప్రాణులు బలై పోతున్నాయో నీకు తెలీనిది కాదు. అది ఆనందమంటావా? ఆగ్రహమంటావా?" ప్రశ్నించాడు పరమశివుడు.

సమాధానం చెప్పలేదామె. "ఇంతకీ మీరు నందుడ్ని క్షమాభిక్షకు పంపిస్తారా? లేక అతనికి నేనే క్షమార్పణ చెప్పాలా?" ప్రశ్నించింది చిరుకోపంతోనే—

శివుడు వెంటనే భూలోకానికి వెళ్ళాడు.

నందుడు శివుడ్ని చూడగానే పాదాలపై పడి నమస్కరించాడు- నందుడికి శివుడి దర్శనం మహాభాగ్యంగా, నేత్రానందంగా ఉంది. ఎన్నో అష్టకష్టాలను భరించి తపో దీక్ష చేస్తే ఆ మహానుభావుని దర్శనభాగ్యం కలగడం దుర్లభం- అలాంటిది తనకై తను ఆ భాగ్యాన్ని కలిగించి నందుకు సంతోషం వ్యక్తం చేశాడు.

"భక్తా! నందా! ఏనాడూ నేనెవ్వరినీ వరాలనర్థించలేదు. ఈనాడు నీవే నాకో వరాన్ని ప్రసాదించాలి. అది తప్పో- ఒప్పో నాకు తెలేదు, నా కోరికను తీర్చగలవా?" ప్రశ్నించాడు ఈశ్వరుడు.

"త్రినేత్రధారీ! ఎంతమాట! మీకు నేను వరాలనివ్వగల వాడినా? మీరు కో తం ఓ విధంగా ఏ పూర్వజన్మ పుణ్య ఫలమో. మీరు కోరాలేగానీ నా ప్రాణాలు సహితం ఆనందంగా మీకు కానుకగా సమర్పిస్తాను" హృదయానంద కరంగా పలికాడు నందుడు.

"మునికుమారా! గంగాదేవికి నీపై ఆగ్రహం కలిగింది.



ఆమె ముచ్చటకోసం నీవామెకు క్షమార్పణ చెప్పాలి- అప్పుడే ఆమె ఆత్మ శాంతించగలదు."

"హాం! పరమశివా! క్షమార్పణ చెప్పాల్సిన అగత్యం నిజంగా నాకులేదు. అమాయకులైన ఆశ్రమవాసులను రక్షించమని ఆమెను మొదటే అర్థించాను. ఆమెకు తను లేనిదే సృష్టిలేదన్న గర్వం ఉంది. నిజమే ఆ మాతృశ్రీ రక్షణలోనే ఎన్నో ప్రాణాలు రక్షింపబడుతున్నాయి— పరమశివా! బిడ్డల్లాంటి ఈ సకల ప్రాణులను కంటికిరెప్పలా కాపాడ్డానికి బదులు కాటువేయడం న్యాయమంటావా?"

"ముని పుంగవా! సృష్టికార్య రహస్యాలు నీకు మాత్రం తెలియనివికావు- అది ప్రకృతి ధర్మం. పుట్టించడం గిట్టించడం దైవత్వ రహస్యం- అలాంటి దైవ నిర్ణయాన్ని శాసించే హక్కూ, అధికారాలూ ఎవ్వరికీలేవు- తపఃశీలుడివైన నీవు ఈనాడు చేసిందేమిటి? సృష్టిని నీ గుప్పిటలో ఉంచాలనుకోవడం నేరంకాదా?"

"అది నేరమో పాపమో నాకు తెలీదు స్వామీ! పుట్టించినదీ మీరే, గిట్టించేదీ మీరే- మానవుల్ని పుట్టించడం వాళ్ళను కష్టాలకూ. కన్నీళ్ళకూ గురిచేయడం. వారితో పాపాలు చేయించడం పతనం చేయడం మీకు తగునా దేవా? శివాజ్ఞ లేనిదే చీమైనా కదలదంటారు! మీరు ప్రేరేపించకపోతే నరులు ఏ నేరాలూ. ఘోరాలూ చేయరు- నేనూ మానవుడ్నే- మీ ఆజ్ఞ ప్రకారమే నేను గంగాదేవిపై ఆగ్రహించి ఉంటాను. ఇందుకు శిక్షకూడా ఆనందంగా విధించండి—భరించే శక్తికూడా నాకు ప్రసాదించండి" చేతులెత్తి నమస్కరించాడు—

"సత్ పురుషా! నువ్వు శాపించడము తల్లిని నిర్బంధించడం లాంటిది. అల్పమైన కోరికతో, పట్టుదలతో నీవు సృష్టికే హాని తలపెట్టావు! జరిగిందేదో జరిగిపోయింది. నీవు గంగాదేవిని క్షమాభిక్ష వేడుకోవడంతో నేనూ ఆనందిస్తాను."

''స్వామీ! నా తల్లిలాంటి గంగాదేవికి నేను క్షమార్పణ చెప్పడానికి బాధపడను. ఈ క్షణమే మీతో కైలాసానికి వస్తాను. మీ ముచ్చట తీర్చగలను. పదండి'' అన్నాడు ప్రశాంత స్వరంతో.

కైలాసనాథునితోపాటు నందుడు గగనవిహారం సాగిస్తూ గంగాదేవిని చేరుకున్నాడు. కురులు విరబోసుకుని దీన వదనంతో గంగాదేవి కనిపించిందక్కడ —

"మాతా! తమ కోరిక నన్నీ కైలాసవాసాన్ని బొందితోపాటు చూసే భాగ్యాన్ని కలిగించింది. జగత్‌లో నాకంటే అదృష్టవంతుడు యింకొకడులేడు. దివ్యమాతా! ఆనాటి నా అజ్ఞానం ఇంతటి మహాభాగ్యాన్ని కలిగిస్తోందని వూహించలేకపోయాను. సకలలోక పావనీ! సకల ప్రాణ రక్షణీ- నన్ను క్షమించు తల్లీ" నమస్కరించాడు నందుడు

ఆమె ఆనందంగా ముఖం పెట్టింది. ఈశ్వరుడికీ ఆనందంగానే ఉంది. నందుడు కైలాసానికి బొందితో వెళ్ళడం తన భాగ్యమని మురిసిపోతున్నాడు.

ఈశ్వరుడు నందుడ్ని తన కానుకలతో మరింత ఆనందాశ్చర్యాలతో ముంచెత్తాడు. పార్వతీదేవి అప్పుడే అక్కడికి ప్రవేశించింది. ఆ సమయంలో నందుడు గంగాదేవి పాదాలకు నమస్కరించి భూలోకానికి తిరుగుముఖం



పట్టాడు.

పార్వతీదేవి కనిపించగానే ఆమెకూ నమస్కరించాడు. ఆమె అతని వినయ విధేయతలను ప్రశంసించకుండా ఉండలేకపోయింది. ''భూలోకంలో నీవు అఖండ కీర్తి ప్రతిష్ఠలు పొంది. వెయ్యి కాలాలపాటు రారాజుగా, ధర్మ ప్రభువుగా కొనియాడబడి, సంసార స్వర్గ సౌఖ్యాలు అనుభవించి, ఈ కైలాసానికి ఆనందంగా వసావు."

"మాతా! మహాభాగ్యము. కానీ" చెప్పలేకపోయాడు.

''పుత్రా! ఏమిటి నీ ధర్మ సందేహం?'' ప్రశ్నించింది ఉమాదేవి.

''గౌరీ మాతా! మీకు తెలియనిదేమున్నది? ముని సంతతికి ఐహిక సుఖాలపై, రాజ్య భోగాలపై ఆసక్తి ఉండదు. జీవహింస చేయడానికి మనస్సంగీకరించదు. సాధు స్వభావుడనైన నేను క్షత్రియ ధర్మాలకు లొంగవల్సి వస్తుంది. క్షమించు తల్లీ! నాకు శివపార్వతుల దర్శనం కలిగింది. అంతకంటే నాకు మరో భాగ్యాలపై వ్యామోహం లేదు'' అన్నాడు వినయపూర్వక స్వరంతో —

అతని మాటలకు గంగాదేవి మళ్ళీ లోలోన ఆవేశానికి గురై పోతోంది. 'అతనికి పార్వతిపై వున్న మమకారం నాపై లేదన్న మాట' ఇంకా ఏదేదో యోచిస్తూ ఉంది.

''మునివర్యా! పూర్వజన్మలో నీవు క్షత్రియుడివే. దాన ధర్మ పుణ్య ఫలంగా నీవు ముని కుమారుడివిగా జన్మించావు. నీవు సంకోచించకు! ఇప్పుడే నిన్ను రారాజును చేస్తున్నాను. నీ మాటలకూ, కత్తికీ తిరుగు

లేదు- జీవహింస చేయలేకపోయినా, నీకు ఎవ్వరూ శత్రువు లుండరు, నీవు నా మాటలను కాదనకు...."

"మహాప్రసాదం మాతా! అంతా తమ కరుణాభిక్ష- నా జీవనరథం యిలా జరుగుతుందని కలలోకూడా ఊహించలేదు. పాలించడానికి నాకే రాజ్యం వుందో సెల విస్తే సంతోషిస్తాను'' అన్నాడు ఆనందం నిండిన ముఖంతో చూస్తూ__

"మునిపుత్రా! నీవు భూలోకానికి వెళ్ళు....జరగవలసిం దంతా జరిగి తీరుతుంది" అంది చిరునవ్వు ముఖపద్మంతో చూస్తూ__

"మహాప్రసాదం" అందరికీ నమస్కరించి వెళ్ళి పోయాడు నందుడు.

నందుడు తన ఆశ్రమాన్ని చేరుకున్నాడు. ఆశ్రమ వాసులందరూ ఆయనకు జేజేలు పలికారు. కైలాసంలోని విశేషాలను తెలియజేశాడు. అందరూ ఆయన మాటలను వింటున్నారు. అయినా వారిని నందుడు మహారాజుగా ఎలా మారుతాడో పాలుపోవడంలేదు.

నందుడు ఆశ్రమంలోని జింక చర్మంపై విశ్రాంతి తీసుకుంటున్నాడు. శిష్యులు ఆయన పాదాలను మర్దిస్తుం డగా హాయిగా సుఖ నిద్రలో జారుకున్నాడు- శిష్యులు కూడా కునికిపాట్లు తీస్తున్నారు.

ఓ బంగారు పావురం 'రెపరెప' రెక్కలాడించుకుంటూ వచ్చింది. దాని నోటిలో ఓ మణిహారము మెరిసిపోతూ ఉంది. దివ్యానంద స్వాముల మెడలో ఆ హారాన్ని వేసింది పావురాయి__



ఆశ్రమ వాసులంతా ఆనంద చకితులయ్యారు. ఆశ్చ ర్యంగా వారంతా ఆ చోద్యాన్ని తిలకిస్తూ ఉన్నారు. పక్షి రెక్కలతో వింజామరల్లా గాలి విసురుతూ ఉంది. అద మరిచి నిద్రిస్తున్నాడు నందుడు.

ఈలోగా మంత్రి జనంతుడు తన సైనికులతోబాటు పసిడి రథాన్నికూడ అక్కడికి తెచ్చాడు. గుర్రపుడెక్కల సవ్వడికి నిద్రనుండి లేచాడు నందుడు__జనంతుడు ముని పుంగవుడి చెంతకు నడిచి వినయ పూర్వకంగా నమస్క రించాడు__

"మహాత్మా! నేను త్రిపుర రాజ్యానికి మంత్రిని- పేరు జనంతుడు. మా మహారాజుగారు వసంతుడు కడు వృద్ధుడు- అతని ఏకైక పుత్రికారత్నం మందాకినీదేవి. ఆమెకు వివాహంచేయ నిశ్చయించిన మా మహారాజుగారు తమకు దివ్యఋషులు ప్రసాదించిన పావురాయిద్వారా తన కూతురి వివాహం, తన రాజ్యానికి తగు అర్హతగల ప్రభువునూ ఎన్నుకో దలిచారు. ఎన్ని దేశాలు తిరిగినా ఈ పసిడి పావురాయి తన నోటనున్న మణిహారాన్ని ఎవ్వరి కంఠంలో వేయక మమ్మల్ని ఎంతో శ్రమకు గురిచేసింది. చివరకు కారడవుల్లో జపభక్తిగల మీ ఆశ్రమానికా పావురాయి రావడం అది మీ కంఠసీమలో హారాన్ని వేయడంతో మాకు మహా సంతోషంగా ఉంది" అన్నాడు వినయపూర్వక స్వరంతో జనంతుడు.

నందుడికి గిరిజాదేవి మాటలు స్ఫురణకు వచ్చాయి- వెంటనే పైకిలేచి ''ఆశ్రమ వాసులందరికీ ఈ ఆనంద సమయంలో ఓ మనవి- నేనీ ఆశ్రమాన్ని వదలి వెళ్ళ

దానికి ఎంతో వ్యథకు లోనవుతున్నాను. ఇన్నిరోజులూ మీరంతా నా యెడల చూపించిన ఆప్యాయతానురాగాలను ఏనాడూ మరువలేను. అయినా నేనీ కార్యభారాన్నంగీకరించక తప్పదు. ఇది దైవశాసనం! పార్వతీదేవి కరుణాకటాక్షం. ఈ ఆశ్రమాన్ని సురక్షితం చేయాల్సిన బాధ్యత నేటినుండి మీ అందరిపైనా ఉంది'' అన్నాడు సజల నయనాలతో అందరినీ పరిశీలనగా చూస్తూ....

ఆడా, మగా, పిల్లా, పెద్దా తేడా లేకుండా అందరూ ఆయన పాదాలపై అశ్రువర్షం కురిపించారు—"ఇన్నాళ్ళూ తల్లినీ, తండ్రినీ, గురుదైవాలను మీలో చూశాము. అకస్మాత్‌గా మీరు మమ్మల్నందరినీ వీడి వెళుతుంటే ఎంతో విలువైన సంపదను దూరం చేసుకున్నట్లు వ్యథగా ఉంది. ఈ కారడవుల్లో క్రూర జంతువుల బారినుండీ, జల ప్రళయాలనుండీ మమ్మల్ని దైవంలా కాపాడిన మహా పురుషులు మీరు. మీ కరుణాభిక్షకు దూరమై మేమెలా బ్రతకగలము? మేమూ మీతోనే వస్తాము. మీ రాజ్యంలోనే ఓ మారుమూల ప్రాంతంలో మాకు ఆశ్రమం కట్టించి యివ్వండి చాలు, మిమ్మల్ని నిత్యం దర్శించే భాగ్యానికి మేము నోచుకోలేదా మహా తపస్వీ!" పుండరీకుడనే మునివర్యుడు సజల నయనాలతో చూస్తూ ప్రశ్నించాడు.

"పుండరీకా! నీ మనోవేదనను అర్థం చేసుకోలేనంతటి మూర్ఖుడనుగాను నేను. మీరంతా నావాళ్ళూ, నా ఆత్మీయులు. ఈ భ్రమ ఏనాడు నాలో కలిగిందో కానీ. ఆ క్షణమే నా ఋషిత్వం మాయమయ్యింది. రాజరికం నాకు తెలీకుండా



దానే నన్ను వరించింది, ఋషులకు బంధుప్రీతి వుండరాదు కానీ శిష్యప్రీతి వుండటంలో తప్పలేదు. నేను మిమ్మల్ని శిష్యులుగా ఏనాడూ భావించలేదు. మిమ్మల్ని నా ఆత్మబంధువులుగా భావించుకున్నాను....రండి....మా రాజ్యంలోనే మీకు ఆశ్రమాన్ని నిర్మించగలను. మిమ్మల్ని వదిలి నేను సహితం జీవించడం బహు క్లిష్టం'' అన్నాడు శాంత స్వరంతో.

అందరూ నందుడికి మళ్ళీ జేజేలు పలికారు

సైనికులు ఆయన మన్నిత పాదాలు కందకుండా పుష్పాలు పరిచారు. మధ్యమైన పుష్పపాన్పై నడుస్తూ రథాన్ని చేరుకున్నాడు నందుడు. సైనికులూ, బసవంతుడూ అశ్వాల నధిరోహించి, ముందుకు వెళుతున్నారు.

రథం నెమ్మదిగా ముందుకు కదిలి వెళుతుంది.

ఆశ్రమవాసులు రథాన్ని అనుసరిస్తున్నారు.

o o o

మందాకినికి నందుడు స్వామి చరిత్రంతా తెలిసిపోయింది. తనకు కాబోయే పతిదైవం ఓ సత్పురుషుడూ, దివ్య తపోబలం గలవాడని తెలుసుకుని ఆనంద పడింది. నందుడూ సామాన్యుడేమీ కాదు. అతని ముఖపద్మాన్ని తెరచాటు నుండి తదేకంగా చూసింది యువరాణి.

నిండు చందమామలోని తేజస్సు అతని ముఖంలో కనిపించింది. మన్మథ రూపరేఖలు అతని విశాల నేత్రాల్లో నిటారైన చక్కని నాసికంలో, హరివిల్లులా మలుపులు తిరిగిన అరుణాధరాలలో కనిపించాయి.

శేషుడిగా, ఈ రాజ్యాధినేతగా అందరి మన్ననలకూ ప్రశంసలకూ పాత్రుడయ్యాడు.

మందాకిని మస్తిష్కంలో యింకా ఏవేవో ఊహలు చెలరేగుతున్నాయి. గంగాదేవి ప్రవృత్తిపై యింకా ఆగ్రహంగానే వుంది. మునివర్యులు సహజంగా సున్నిత సాధు స్వభావం గలవారు. వారు లోకకళ్యాణానికై ఐహిక సుఖబంధ, బంధుత్వాలనూ ఆత్మీయులనూ వదిలి కారడవుల్లో క్రూర మృగాలను సహితం మచ్చిక చేసుకుని తపో దీక్షను బూనేవారు. అలాంటివారిని గంగాదేవి కర్కశ హృదయంతో కలతకు గురిచేసింది.

ఆనాడు ధృవుడు ఆమెను మాతృశ్రీగా భావించి శ్లాఘిస్తుండగా, అతని శిష్యబృందం సహితం ఆమెనా భావంతోనే చూశారు. ముని కుమారుల ప్రేమంటే ఏమిటో గంగాదేవికి తెలిసినది కాదు. ధృవుడా నాడు ఆమెను వీడి వైకుంఠానికి వెళ్ళడానికి కూడా ఇష్టపడలేదు.

గంగమ్మా గోవిందనామాన్ని వదలడానికి ధృవుడికి ఇష్టంలేదు. తమ చివరగా తన కొరకు దివ్య విమానం వైకుంఠంనుండి రాగా బాధతో అంతిమస్నానం చేశాడు. ఆమెకు సాష్టాంగ నమస్కారం చేశాడు. అతనికి దుఃఖం కలిగింది. హృదయం భారమయ్యింది.

"అమ్మా! భగవంతుని ఆజ్ఞతో నేను వెళుతున్నాను. నీవు జ్ఞాన గంగవు. నీ తీరాన లభించిన ఆనందం నాకు వైకుంఠంలో లభించగలదా మాతా!" అడిగాడు దీనంగా.

"నాయనా! ఇక్కడ నేను భౌతిక దేహంతో ఉంటాను, వైకుంఠంలో ఆది భౌతిక స్వరూపంతో విష్ణు పాదాలదగ్గర



నేనుకూడా ఉంటాను. నాకోసం నీవు బెంగ పడవల దని వారించిన గంగాదేవి దివ్యానందుడి విషయంలో ఎందుకంత పట్టుదలతో వ్యవహరించింది?

ఇంకా పలుపలు విధాలుగా యోచిస్తూ నిద్రలోకి జారుకుంది మందాకిని.

o o o

ఓ సుముహూర్తంలో త్రిపుర రాజ్యాధిపతి అయ్యాడు నందుడు. దేశదేశాల రాజుల నందరినీ దివ్యానందుడాహ్వానించాడు కనుక దాదాపు అన్నిదేశాల చక్రవర్తులంతా ఆ వేడుకను చూశారు. వారందరితోపాటు త్రిపురరాజ్య ప్రజ అంతా ఆ ఆనందోత్సవాన్ని కళ్ళారా చూడాలని ముచ్చట పడి తండోపతండాలుగా వచ్చారు.

అందరి సమక్షంలో వసంతుడు ఆనందంగా నందునికీ, మందాకినికీ పెళ్ళి జరిపించాడు. మెరుపుతీగలా నవయౌవ్వన రమ్య దేహచ్ఛాయతో, సజీవ పసిడి విగ్రహంలా శోభించే మందాకిని యౌవ్వనోద్రేకంతో వున్న రాజులందరూ తదేకంగా చూస్తున్నారు.

ప్రజలందరికీ ఆ జంట చూడ ముచ్చటగా, నేత్రపర్వంగా వుంది.... ధన, కనక, అన్న వస్త్ర దానాలు ఆ దివ్యజంట చేతులమీదుగా ప్రజలందరికీ అందాయి ఆనాడు! ఆ దేశ ప్రజల్లో ఎన్నడూ లేనంతటి నూతనోత్సాహం ప్రజ్వరిల్లింది. సంతోషానందాలతో దివ్యానందస్వాములకు జేజేలు పలుకుతుంటే వినలేని కొందరు చల్లగా వెలుపలకు జారుకున్నారు.

ముఖ్యంగా పొరుగుదేశ చక్రవర్తులైన భూపాలుడూ,

తన కూతురికి ఈ భూప్రపంచంలో వరుడే కరువయినట్లు సన్యాసికిచ్చి పెళ్ళి జరిపిస్తాడా? తగిన రీతిలో ఆ మునీశ్వరుడికీ, ముసలి వసంతుడికి బుద్ధి చెప్పాలి" అన్నాడు భీకర స్వరంతో.

"మనకిప్పుడు కావాల్సింది ఆవేశంకాదు! ఆలోచన.... మందాకిన్ని మనం ఆ బంగారు పంజరంలోంచి వెలుపలికి తీసుకురావాలి ఎలా?" రహస్యం చెప్పినట్లు పలికాడు రణధీరుడు.

భూపాలుడు రణధీరుడి చెవిలో ఏదో ఊదాడు.

ఇద్దరూ ఆనందంగా, వికృతంగా నవ్వుకున్నారు.

o o o

ఆ వెండి వెలుగుల కిరణాల్లో.... నందుడు రాచ వస్త్రాభరణాలను ధరించాడు ముత్యంలా శోభించే మందారాన్ని పాల నురుగులాంటి ధవళ వస్త్రాభరణాలతో మయూరిలా మందగమనం చేస్తూ సిగ్గునభినయిస్తూ ముందుకు నడుస్తూ పతిదేవుడ్ని చేరుకుంది.

చుక్కలు ఒక్కసారి పక్కున నవ్వినట్లు మరింత ఆసక్తిగా వారిద్దరి ప్రణయాన్ని చూస్తున్నట్లు మరింత ప్రకాశవంతంగా వెలిగిపోతున్నాయి సుమధుర సుప్రశాంత చిరుగాలులు ఆమెను మరింత ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. బుగ్గల్లో ఎక్కడలేని సిగ్గంతా దోబూచులాడుతుంది.

అతను బంగారు తీగలా, ఆమె మెరుపుతీగలా ఆ వెలుగుల్లో ధగధగ మెరిసిపోతున్నారు. చిరునవ్వుల పువ్వులా ఆమె అధరాధరంలోంచి సమ్మోహనాస్త్రంలా అతని హృదయాంతరాల్లో తొణికిసలాడుతున్నాయి.



అతని హృదయ సామ్రాజ్యంలో ఆమె అభినవ రతీదేవి- ఆమె మెత్తని భుజస్కంధాలనందుకున్నాడు. ఆమె శరీరం జలదరించింది. ఊపిరి గట్టిగా పీల్చుకుని పెద్ద కళ్ళతో ఓ క్షణం ధీరంగా. సిగ్గుగా చూసింది.

ఆమె నాజూకైన వక్షంపై చేయివేశాడు. సున్నితంగా అలా అలా మెల్లగా లాలనగా నిమిరాడు. అంచెలంచెలుగా పరవశాలు తియ్యగా మూల్గుతూ హాయిగా, మత్తుగా, వేడిగా పురి తిరిగిపోతున్నాయి ఆమెలో.

ఇరువురూ గాఢంగా చుంబించుకుంటున్నారు అతనెక్కడ స్పృశించినా ఆమెకంతా తియ్యని క్రొత్త మైకంగా, హాయిగా వుంది. అధరామృత ధారలను ఒకరున్నింది మరొకరు జుర్రుకున్నారు. ఆమె ఎత్తైన ఘనమైన వక్షోజాలు అతని గుండెలపై వేడిగా హత్తుకుపోయాయి.

పరవశంతో ఇద్దరి దేహాలు మరింత బిగువుగా పెనవేసుకుపోతున్నాయి. ఆమె అధరాలు చుంబనతో మరింత ఎరుపెక్కిపోయాయి కపోలాలు వెన్నముద్దల్లా అందంగా ముందుకు సాగాయి. అతని లేత పెదాలు ఆమె అందమైన చెక్కిళ్ళను స్పృశించుకుంటే పులకింతలు పెంచేటి తరంగాలై శరీరమంతా ప్రాకాయి.

ఏదో తెలియని అతీతమైన కోరిక ఆమె అంతర్యంలో మసలు తిరుగుతూ వుంది. తొలిసారిగా పురుష స్పర్శలోని మాధుర్యాలను చవిచూస్తుంది. ఆ స్పర్శలో ఎంతటి అమృతానందాలు దాగివున్నాయి? ఎంత పులకింత? ఎంతటి వ్యామోహం!

ఇంకా తనలో ఏవేవో భావాలు చెలరేగాయి. ఎలా వుం

టుందో పురుష సంగమం అనుకుంటూనే గట్టిగా పట్టుకు వదులుతూ అతన్ని మరింత హత్తుకుపోయింది. సుందరుడు కూడ మైమరచిపోయాడు. ఎత్తైన ఆమె స్తనాలు సంపెంగ మొగ్గల్లా అతని విశాల వక్షం పై వొదిగిపోతున్నాయి. ఆమె మృదువైన వెన్నును ప్రియంగా నిమురుతున్నాడు.

సుపరిమళ ఆత్రుత వచ్చిన వారిద్దరిలోని ప్రదర్శన్ని మరింత విజృంభింప జేసింది. తీరని ఉద్రేకంతో తనువులు తపించిపోతున్నాయి. అదే సమయంలో 'కెవ్'వ కేకేసింది మందాకిని

దివ్యానందుడు చలించాడు, అతని వెన్నులో మెత్తగా దిగిందో కత్తి- 'చివ్'వ రక్తం చిమ్మింది- మరోకత్తి "సక్"మంటూ అతని వెన్నులో దిగింది. ఆందోళనతో నోరు తెరిచిందిమందాకిని. అతని శరీరంలోని వేడి రక్తం చివ్వన ఆమె నోట్లోకి రానే వచ్చింది.

నల్లటి ముసుగులోవున్న ఆకారం మెరుపువేగంతో రాకుమారిని అందుకుని చేతుల్లో మోసుకుపోతుంది. ఆమె కేకలు వేయకుండా బలంగా తన చేత్తో అదిమిపట్టింది ఆకారం. దివ్యానందుడికి మైకం కమ్మింది. ఏదో తపించ బోయాడు. కానీ, నోటిమంచి మాటలు దొర్లి రావడంలేదు.

అప్పటికే శరీరమంతా స్వేదంతో తడిసి ముద్దయ్యింది. నీరసంతో నరాలన్నీ సుడులు తిరుగుతున్నాయి బాధ దేహమంతా ప్రాకింది. నించోడానికూడా శక్తి చాలడంలేదు. కాళ్లూ, చేతులు ఆఖరికి అంగుళంకూడా ముందుకు కదలలేక పోతున్నాయి.

నిస్సత్తువ, నిస్సహాయాలతో నేలపై మొదలు నరికిన



చెట్టులా పడిపోయాడు. అప్పటికే ముసుగు వ్యక్తి నగర పొలిమేరల్ని దాటి పోతున్నాడు. ఇంత జరిగినా పెంచు దింపడంలేదు

అసలు సైన్యానికి రాకుమారిని ఎవరో అపహరించుకు పోతున్నారన్న విషయమే తెలీదు! శోభనరాత్రి కనుక! తెల్లారేవరకూ ఎవరూ ఆ మందిరంవైపు చూడలేదు.

o o o

ఎవరివో మెత్తని చేతులు తనను స్పర్శించేసరికి తృళ్ళి పడి కళ్ళు తెరిచింది మందాకిని ఎదురుగా కణధీరుడు మృగం లాంటి చూపులతో ఆమెను మరింత భయానికి లోనుచేశాడు.

"దుర్మార్గుడా! ఎంతకు సాహసించావు. పతివ్రతలతో, వారి జీవితాలతో చెలగాటమాడితే పతనమైపోతావు?" ఉక్రోషంగా పలికిందామె.

"అమృతం నీ అందాల అధరాల్లో దాగుందే అప్సరా! ప్రతి అవయవంలో ఏదో అతీతమైన దివ్యలావణ్యం తొంగి చూస్తుంది. జగదేకసుందరిలా, రమ్య రతీదేవిలా శోభించే నీవు నాలాంటి రసిక చక్రవర్తికి సరియైన వరసాంగివి. ముక్కు మూసుకుని జపంచేసే ముని వంశీయుడు నేడు నిన్ను వివాహమాడి చక్రవర్తి అయినంత మాత్రాన నీ వయసు సొంపులతో రతి క్రీడలాడ్డానికి అనర్హుడు. సహజ క్షత్రియుడినైన నా రక్తం నీ పొందుకోసం ఎంత తపించి పోతుందో, ఎంతవేగంగా, వేడిగా పరవళ్ళు త్రొక్కుతుందో ఒకే ఒకసారి మధుర కౌగిలిలో చవిచూడు - ఊ... రా ..." కామోద్రేకంతో అతని కళ్ళు ఎర్రబడిపోయాయి. దేహం వేడిగా మండిపోతుంది.

"ఆగూ! కామాంధుడా? నా పవిత్రమైన దేహాన్ని నీ తరస్పర్శతో మలినం చేసినా నా మనోనాథుణ్ణి నిన్ను బూడిద చేస్తాడు" అంది శయ్యమీంచి పైకిలేచి.

రణధీరుడు వికృతంగా నవ్వాడు. "ఏమిటా పవ్వాలు! నీదునా.... నిప్పులాంటి దాన్ని స్పృశించాలని యత్నిస్తే ఏమౌతావో యోచించు. నా మాంగల్యమే పవిత్రమైనదైతే ఈ క్షణమే నీవు తగిన ఫలితానన్నుభవిస్తావు" కళ్ళు మూసుకుని ఒక్కసారి భర్తను ధ్యానించుకుని, వేడి అశ్రుజలాన్ని వదిలింది

ఆమె కళ్ళనుండి కారిన నీటిచుక్కలు భగ్గున మండాయి. రణధీరుడి మత్తంతా వదిలింది. వెన్నులోంచి భయం తన్నుకు వచ్చింది. జ్వాలలు గాలిలో లేచాయి. అతన్ని మందిరంనుంచి దూరంగా తరిమాయి.

మందాకిని పవిత్ర ఉయ్యాలపై పవళించింది. ఆమె శోక దేవతలా ఉండిపోయింది. దీర్ఘాలోచనగావిస్తూ సుఖావంగా ఉండిపోయింది.

రణధీరుడు స్పృహతప్పి పడిపోయాడు.

పతిదేవుడైన దివ్యానందుడే విధంగా బాధపడుతున్నాడో? ఇంకా తన కన్యత్వాన్ని పూర్తిగా అతనికర్పించకముందే ఆ ఆనందాన్ననుభవించకముందే అతులు తనను తీరని ఎడబాటుకు లోనుచేశారు.

అలోచించినా ఏమీ బోధ పడలేదామెకు. తప్పించుకోడానికి యత్నించి కిటికీ తెరిచి చూసింది. చుట్టూ భయంకరంగా సముద్రం కనిపిస్తూ వుంది.

సముద్ర అలల ఘోష ఆమె హృదయాంతరాంలో



కల్లోలాన్ని సృష్టించింది. ఎలా తప్పించుకోవాలో ఆమెకు పాలుపోవడంలేదు. తలకోగా నివ్వెరపోయి వెనక్కి తిరిగి చూసింది సుపరిమళ అత్తరూ పన్నీటిలో జలకాలాడిన భూపాలుడామె సన్నిధికి చేరుకున్నాడు

విషసర్పాన్ని చూసినట్లు చూసిందామె

"నా ప్రాణంలో ప్రాణమై జీవనరాగమైన మధురానంద, అపర రతీదేవీ! ఏమిటలా వాడిగా వేడిగా చూస్తున్నావు? ఆ చూపులకర్థం తెలుసుకోలేనంతటి మూర్ఖుడుకాదీ భూపాలుడు. రసిక శృంగార చక్రవర్తినైకూడా నీ అంగాంగాలకెందుకో ఆకర్షించబడ్డాను. ఓ! నీవు సామాన్యురాలివికాదు కదూ? నీ దివ్య తేజస్సుతో కూడిన సర్వాంగాలు సృష్టిలో ఏ అతివలో అమర్చలేదా సృష్టికర్త. ఆ మాటే నేను మరిచిపోయాను. మధుపానం కాస్త శృతిమించి.... నిన్ను అనాడు పెళ్ళి పీటలపై చూశాను. అప్పట్నుంచీ ఏవేవో భావ వీచికలు మలయ సమీరాలలా యెదను స్పృశించి రాగరంజితం చేస్తున్నాయి అందుకే నాలోని ఆశలను చంపుకోలేక నిన్నిక్కడ బంధించినా మధుర బంధంతో అయ్యాది స్వర్గ సౌఖ్యాలను చవిచూడాలని వచ్చాను.

"మందాకినీ! యౌవనపు తొలిమెట్టుమీద ఉండడంచేత అర్థంలా నీవున్నావు. నేనంటే అయిష్టంగా వుండటం మంచిదికాదు అపరిమితమైన నీ ద్వేషం ఆనందసాగరమవుతుంది. నా అక్కున నీవు ఒదిగి సుఖాలను చవిచూస్తే మంచులా కరిగిపోయి మళ్ళీ మళ్ళీ నా స్పర్శకై పరితపించి, నా పగనిసికి దాసివపై పోతావు ఈ మాటలు అతిశయోక్తిగా అనిపించవచ్చు. కానీ నేనబద్ధం చెప్పడంలేదని

పించాలి. అతని గుండెలపై వాడిగిపోవాలి. అప్పుడే తనకు నిజమైన ఆనందం.

ఆమె దివ్యానందుణ్ని చేరుకుంది. ఆమె రాకకై నిరీక్షించే వారందరూ ఆమె రాకతో ఆనందించారు. దివ్యానందుడి పాద పద్మాలనామె అశ్రుజలంతో స్నానం చేయించింది.

ఆమె కన్నీటిని చూపుడు వ్రేలితో తుడిచి, ఆమెను తన ఏకాంత మందిరానికి నడిపించుకెళ్ళాడు దివ్యానందుడు.

మందాకినిపై వ్యామోహాన్నున్న పరాయి రాజులందరూ భయకంపితులయ్యారు. వారిలో కొందరు దివ్యానందుడికి మచ్చికయ్యారు. మరికొందరు మందాకిని ప్రతిమాన వనిత విగ్రహాన్ని చేయించుకొని ఆమెను తమ అర్ధాంగిగా భావించుకుని భావప్రాప్తిం పొందుతున్నారు.

మహారాజు వసంతుడు మందాకిని విషయంలో ఇకపై తనకెలాంటి చీకూ-చింతా లేదనుకుంటున్నాడు. త్వరలో తనతో ఆడుకోడానికామె గర్భంలో ఓ పసిబాలుడు జన్మించాలని నిత్యం దైవప్రార్థన గావిస్తున్నాడు.

o o o

గంగాదేవి సముద్రంలో తేలియాడే శిరస్సులను తీసుకువచ్చింది. వారిని సంజీవనితో పునర్జీవులను చేయడమేగాక కొన్ని దివ్య మహిమలనుకూడా ప్రసాదించింది. ఆమెకింకా దివ్యానందుడిపై ప్రతీకార చర్య సాధించాలనే వుంది.

రణధీరుడూ, భూపాలుడూ, వరుణుడూ గంగాదేవికి నమస్కరించారు. ఈ పర్యాయం దివ్యానందుణ్ని తప్పక



పరాభవించగలమని వాగ్దానం చేశారు. ఉదయులూ ఏకాంతంగా ఎన్నెన్నో పన్నాగాలు పన్నారు. గంగాదేవి వారిక వులికీ మరింత ధైర్యాన్ని నూరిపోసి అంతర్ధానమయ్యింది.

o o o

దివ్యానందుడిపై యుద్ధాన్ని ప్రకటించాలనుకున్న రాజులా ప్రయత్నాన్ని విరమించుకున్నారు. వారందరికీ అతడి మహిమలంటే భయంగావుంది.

“ఓ వెన్నెలరాత్రి! మందాకిని నెల తప్పింది. ఆమె గర్భంలో దివ్యానందుడి ప్రతిరూపం చిగురిస్తూ వుంది. ఆ వార్త తెలిసిన దివ్యానందుడామె సన్నిధికి చేరాడు. జీవితాన్ని ఆనందమయం చేయగల వార్తను విన్నాను. నిజమేనా!” ప్రశ్నించాడు ఆనందం నిండిన కళ్ళతో చూస్తూ.

ఆమె సిగ్గునభినయిస్తూ పతి సన్నిధికి చేరుకుని నిజమేనని తలాడించింది. పొంగారే ఆమె కపోలాలపై చందమామ కిరణాలు మరింత వాడిగా ప్రకాశిస్తూ ఉన్నాయి. ఆమె సమాధానంతో అతడి అంతరంగంలో అమృతవర్షం కురిసినట్లయింది.

ఆమె మెత్తని భుజంపై చేయివేసి స్పృశించాడు.

ఆమె పరవశంతో అరమోడ్పుగా కళ్ళుంచింది. నెలరేడు మేఘాల చాటుకెళ్ళాడు. నిశీధిలో ప్రకృతి అందాలను సర్దించాడు. అంతఃపురములో దీపాల తోరణాలు ప్రకాశిస్తున్నాయి. మందాకిని అందాల ముందా దీపకాంతు లెందుకూ కొరగావు.

దట్టంగా సుపరిమళాలు వ్యాపించాయి!

అసలే కృష్ణపక్షపు రోజులు- ఎముకలు కొరికే చలిలో గాలికి రెపరెపలాడుతున్న ఆమె నిండు యౌవ్వన సంపదను అతనికి ఆనందంగా అర్పించింది. ఆ స్పర్శలోని తియ్యదనం ఇరువురి శరీరాల్లో నిలువెల్లా వ్యాపించింది.

అతడేం చేసినా కాదని అభ్యంతరం చెప్పలేకపోతోంది.

అతనిలో అంతటి వ్యామోహం వుందని భావించలేక పోయింది.

"మందాకినీ!" పిలిచాడు ఆమె చెక్కిలిపై అధరాలను మర్ధిస్తూ.

ఆ వేడి మధురానుభూతికి పరవశించిపోతూ- "ఊఁ" అంటూ మూల్గింది.

"ఇంతటి సుమధుర సుందర క్షణంలో నీ ముచ్చట తీర్చాలనివుంది."

"మీరిలాగే ప్రతినిత్యం నన్ను సంతోష సాగరంలో ముంచెత్తాలి- అంతకంటే ఆడదానికి ఇంకో ముచ్చట ప్రపంచంలో ఏముంటుంది?" అంది తగ్గు స్వరంతో.

"నిత్యనూతన వధువులా చిరునవ్వుల మధువులా నన్ను ఉల్లాస పరిచే నిన్ను వీడి క్షణమైనా ఉండను- ఏ నాటికీ నీవు నా కళ్ళముందు నా బిగికౌగిలిలో బంతిపూవులా ఇలాగే ఉండిపోవాలని నా కాంక్ష! పవిత్రమైన నీ అందాలు నాకే శాశ్వతం కావాలి. అన్యులెవరైనా వాంఛించే నీ అపురూప లావణ్యం కళంకానికి గురికావడం నేను సహించను. అందుకే! నీవు నన్ను అర్థించకపోయినా నేనే నీకు వరాలనందించగలను- నీ శరీర స్పర్శకే స్పృశించిన



వాటి చేతుల్లో చలనం నశించిపోతుంది- చేష్టా నిర్జీవమై పోతుంది- నా ఒక్కడికే నీ అందాలు దక్కాలి" అన్నాడు.

ఆమె మరింత ఆనందంతో అతన్ని పెనవేసుకు పోయింది.

o o o

"రణధీరా! విన్నావుగా దివ్యానందుడెంతటి స్వార్థపరుడో" రహస్యంగా ఇరువురూ సంభాషించుకుంటున్నారు.

"అ దులో తప్పేముంది భూపాలా! ప్రపంచంలో ఏ పురుషుడైనా తన భార్య అందాలు తనకే స్వంతం కావాలనుకోవడం స్వార్థమెలా అవుతుంది! నీవు వివాహితుడివవుతే నీకూ అలాగే అనిపిస్తుంది- మనంకూడా దివ్యానందుడికంటే వెయ్యింతలు మండిపడక తప్పని విషయానికొస్తే."

భూపాలుడు నిట్టూర్చి- "అయితే ఇంకెందుకు ఆలస్యం! తక్షణం ఎవరి రాజ్యాలకు వారు తిరిగి వెళ్ళడం ఉత్తమం- మందాకినిపై మనకున్న వాంఛలను మంటల్లో కలపాలి- అంతకంటే ఈ పరిస్థితిలో మనం చేయగలిగిందేమీలేదు" నిరుత్సాహంగా పలికాడు.

రణధీరుడికింకా ఆమెపై వ్యామోహం చావలేదు- "దివ్యానందుడి మహిమలు నాశనం కావాలి- దానికేదైనా ఉపాయం ఆలోచించడం మంచిది"

దాంతో! భూపాలుడికో కొత్త ఆశ చిగురించింది.

"ఇప్పుడు మనం ఎంత యోచించినా ఫలితం శూన్యం- మందాకినికి అతను ప్రసాదించిన మహిమలు ఘనమైనవి- దివ్యమైనవి. ఈ తరుణంలో ఆమెను స్పృశించి ఆపదను

కొని తెచ్చుకుంటామేగాని, ఆనందాన్ని అనుభవించలేము, ఇంతకీ దివ్యానందుడి మహిమలెలా భూస్థాపితమవుతాయి!" సందేహాన్ని వ్యక్తం చేశాడు భూపాలుడు. రణధీరుడింకా తీవ్రంగా యోచించాడు.

"షోనిష్! అతని ఆశ్రమ వాసులంతా అందచందాలు గల అతివలే- వారిలో మందాకిని బోలిన అందాలుగల సుందరాంగినెవరినైనా వివాహం చేసుకొని హాయిగా సుఖాల పర్వంలో ఓలలాడ్డం ఉత్తమమనిపిస్తుంది" మళ్ళీ భూపాలుడు తన ఆలోచనను బహిర్గతం చేశాడు.

"భూపాలా! క్షత్రియ రక్తంతో పుట్టిన నీవు వీరుడవని ఆనందించాను2 కేవలం ఓ ముని పుంగవుడి తాంత్రిక విద్యలకు భీతినొంది భీరుడివై ఇలా పిరికితనంతో మాట్లాడం భరించలేకున్నాను. పట్టుదలా, కృషి ఉంటే జీవితంలో సాధించలేనిదంటూ ఉండదు. ప్రతి మనిషి మొదట తనమీదా, తన ఆత్మ విశ్వాసంమీదా గట్టి నమ్మకం ఉండాలి. అది లేనిదే మనిషి ఏదీ సాధించలేడు."

రణధీరుడు అనుభవ పూర్వకంగా తను సాధించిన విజయాలన్నింటినీ బయటపెట్టాడు- దాంతో! మళ్ళీ భూపాలుడిలో కొత్తరకం ఉత్తేజం లేచింది- అతనిలో మందాకినిపై మళ్ళీ వాంఛలు చెలరేగాయి- ఏదియేమైనా ఆమెను తన అర్ధాంగిని చేసుకోవాలనుకున్నాడు.

"ఇంతకీ నీవు చెప్పేది సబబుగానే ఉంది. కానీ, నాకు మరో సందేహం లేకపోలేదు- నీకూ మందాకినంటే అనురాగం ఉంది. ఆమెనర్ధాంగిగా స్వీకరించాలని నాకూ ఉంది. మనలో ఎవరికివారుగా ఆమెకొరకు ప్రయత్నించడం



ఉత్తమం- లేకుంటే మన ఇరువురిలో స్పర్ధలు అకారణంగా పుట్టుకొస్తాయి" అన్నాడు భూపాలుడు మందాకిని విశాల నయనాలెలా వుంటాయో యోచిస్తూ.

రణధీరుడు యోచించి. "అలాగే. ఎవరు ముందుగా ఈ కార్యంలో సఫలీకృతులవుతే వారే ఆమెను వివాహమాడ్డం శ్రేయస్కరం- నీ ప్రయత్నాలు నీవు చేయ్- నేను చేయాల్సిన తతంగాలన్నీ నేను చేస్తాను- సరిగ్గా మూడు సంవత్సరాలకు మనం ఇక్కడే కలవాలి- అప్పుడే ఇరువురిలో ఎంత సామర్థ్యం దాగివుందో తెలుసుకోవాలి. ముఖ్యంగా ఆమెనప్పటికీ మనలో ఎవరైనా లొంగదీసుకోలేకపోతే బ్రతకడం అనవసరం- వస్తాను. మళ్ళీ సరిగ్గా మూడు సంవత్సరాలకు....గుర్తుంచుకో" ఉక్రోషంతో పలికి అశ్వాన్నధిరోహించాడు.

భూపాలుడు రణధీరుడి ఉత్సాహాన్ని చూసి ఉగ్రుడైపోయాడు. అతనిలో కూడా రెట్టింపు చైతన్యం కలిగింది. వెంటనే తన దారిన తాను వెళ్ళాడు.

రణధీరుడు కాస్త ముందుచూపు గలవాడు. వెంటనే అతను శారదపల్లి చేరుకున్నాడు- గంగాదేవిని ధ్యానించాడు. ఆమె సాక్షాత్కరించింది

"రణధీరా! ఏమిటి నీ ధర్మ సందేహం?'' ప్రశ్నించింది ప్రియంగానే

రణధీరుడు జరిగినదంతా ఆమెకు చెప్పాడు. ఇలాంటి స్థితిలో నేను దివ్యానందుడిపై ఎలా పగ సాధించాలి మాతా!?'' ప్రశ్నించాడు బాధగా.

"వీరుడా భీతి చెందకు! దివ్యానందుడి మహిమలన్ని

త్రుటిలో సర్వనాశనం చేయడానికి యింకా కొన్నిరోజుల వ్యవధి ఉన్నది. అతడి ఉదరంపై ఓ దివ్యనేత్రం ఉంది. ఆ నేత్రం విచ్ఛిన్నమయితే అతనికే మహిమలూ ఉండవు. అతనిలో రాజపౌరుషం ఇప్పటికీ లేదు. కనుక! మహిమా రహితుడైన దివ్యానందుణ్ణి అష్టకష్టాలకు గురిచేయడం, రాజ్యభ్రష్టుణ్ణి గావించడం ఏమంత కష్టతరంకాదు. ఈ క్షణంనుండే నీవు ఆ నేత్రాన్ని విచ్ఛిన్నం చేసే కార్యంలో నిమగ్నుడివి కమ్ము. విజయం నిన్నే తప్పక వరించగలదు'' అంటూ అంతర్ధానమయ్యింది.

రణధీరుడు ఆనందంగా ఆమెకు నమస్కరించాడు.

అంతవరకూ గుట్టల దాపునుంచి అంతావిన్న ఓ వర్తకుడు తన అశ్వాన్ని మరింత వేగంగా ముందుకు పోనిస్తున్నాడు. రణధీరుడికా విషయంలో అంతగా అనుమానం రాలేదు. అందుకే! ఆ వర్తకుడు ప్రాణాలతో బైటపడ్డాడు.

వర్తకుడు సంజయుడు దీర్ఘంగా యోచిస్తున్నాడు. దివ్యానందుణ్ణి గూర్చి అతనికిదివరకే తెలుసు. అయినా, రణధీరుడు గంగాదేవి ద్వారా అతని మహిమలనెందుకు విచ్ఛిన్నం గావించాలనుకున్నాడు? ఇంకెందులకూ? దివ్యానందుడిపై కక్ష సాధించేందుకు? ఈయన్ను రాజ్యభ్రష్టుణ్ణి చేయడానికి.

ఆలోచిస్తూ ఆ అడవుల్ని దాటేసరికి పశ్చిమాన సూర్యుడు అంత్య వెలుగుల్లో వున్నాడు. గుర్రాన్ని మరింత వేగంగా ముందుకు పోనించాడు. ఓ పూటకూళ్ళ మునలమ్మ ఇంటిలో మకాం వేశాడా రాత్రి.



ఆమె పేరు శాలిని. పేరుకు తగిన అందం యింకా ఆమెలో వెలిగిపోతోంది. ఆమె కూతురు విశాలి. విశాలి కింకా పెళ్ళికాలేదు. వయసు తెచ్చిన అందంతో కుందనపు బొమ్మలా వెలిగిపోతోంది. ఆమె పెళ్ళి చేయాలని వేన్నీళ్ళకు చన్నీళ్ళతోడు అన్నట్లు జోతిష్యంకూడా. ఓ బాటసారి ద్వారా గ్రహించింది

భూపాలుడు కూడా ప్రస్తుతం ఆమె విడిదిలోనే మారు వేషంలో వున్నాడు. విశాలిని చూడగానే అతడిలో ఏవో కోర్కెలు వికసించాయి. కానీ శాలిని పరిస్థితి తెలీగానే తన కోరికలను అదుపు చేసుకున్నాడు.

శాలిని ఆ రాత్రి బాటసారులందరికీ తృప్తిగా భోజనం వడ్డించింది

వర్తకుడు సంజయుడు ఎప్పుడొచ్చినా శాలిన్ని చూసి వెళుతుంటాడు. ఆమెకి పెళ్ళిసంబంధాలు చూస్తున్నాడు. ఆమెతో ఆ విషయమే తోంచేస్తూ చెప్పాడు ఒండి వ్యాపారబుద్ధి పోనివ్వలేదు. విషయాన్నంత సులభంగా ఆమెతో చెప్పడం!

ఆమె అతని బుద్ధిని అర్థం చేసుకుంది. అతనికి నెయ్యి ఊరగాయలూ వడ్డించింది, అందరికంటే మిన్నగా. ఇంకా తృప్తిలేదు సంజయుడికి. అన్నం వడ్డించి, మీగడ పెరుగు వేసి, తాంబూలంతో బాటు అరటి పళ్ళు అందించింది.

ఆ తర్వాత సంజయుడు తృప్తిగా అన్నింటినీ ఆరగించి చెప్పాడు. ఉదయగిరిలో ఓ వజ్రాల వ్యాపారి ఉన్నాడనీ, అతనికి కోట్లకొలది ధనరాసులున్నాయని. కానీ అతనికిది

వరకే మూడు వివాహాలు జరిగిపోయాయట. అంతేకాదు. అతడికి అరవై ఏళ్ళ వయస్సుందట. పిల్లాజెల్లా లేకపోవడంతో సంజయుడితో సంసార లక్షణాలు గల సంపెంగ పూవులాంటి కన్యపిల్లను కళ్యాణమాడే వుద్దేశ్యంతో చెప్పాడట.

శాలినికి ఆ సంబంధం సుతారమూ ఇష్టంలేదు. తన కూతురు షష్ఠి పూర్తి కానున్న వాడితో వివాహమాడ్డం ఆమెకు నచ్చదు. మెరుపు తీగలాంటి విశాలికి సంపన్నుడు లభ్యంకాకున్నా- సహృదయుడు భర్త అయితే అదే పదివేలు.

ఆ మాటే శాలిని సంజయుడితో బాధగా చెప్పి కన్నీరొలికింది.

భూపాలుడింకా సహనంతో వుండలేకపోయాడు. ఆమె కంటి తడిని చూడలేకపోయాడు. తన రాజ్యంలో సేనాని యుగంధరుడు అవివాహితుడిగానే వున్నాడు. అతడికే విశాలినిచ్చి తనే స్వయంగా ఆ వివాహాన్ని ఘనంగా జరిపించాలనుకున్నాడు.

ఆ మాటే శాలినితో చెప్పాడు భూపాలుడు.

అక్కడున్న వారందరూ విస్మయంగా చూశారతన్ని.

శాలిని భూపాలుడి పాదాలకు నమస్కరించింది.

"కానీ. నీకు జ్యోతిష్యంలో మంచి ప్రావీణ్యత వుందని నాకు ఈనాడే తెలిసింది. జరిగేది, జరగబోయేది నీకు తెలుసు. నీవు నాకు ఈ రాత్రి జ్యోతిష్యం చెప్పాలి" అన్నాడు భూపాలుడు.



శాలిని వెంటనే అతన్ని ప్రత్యేక గదికి పిలుచుకుపోయింది.

సంజయుడు నక్కలా ఆమె ఏం చెపుతుందోనని అనుసరించాడు.

ఆమె దైవప్రార్థనలో నిమగ్నమైంది.

సంజయుడు మరింత కుతూహలంగా నక్కి దాక్కున్నాడు.

"భూపాలా! నృపాలుడివైన నీవు అతి సామాన్యుడిలా ఆడదానిపై వ్యామోహాన్ని పెంచుకుని ఇలా సంచరించడం క్షేమకరం కాదు. కన్యపై ఇలాంటి కాంక్ష వుంటే తప్పుకాదు. ఈ దేశ యువరాణిని నీవు సొంతం చేసుకోవాలనుకోడం మూర్ఖత్వమో, వ్యామోహమో నాకు పాలుపోవడంలేదు. మందాకిని వివాహిత. పైగా ఓ సత్పురుషుడ్ని వివాహం చేసుకున్నానన్న ఆనందం ఆమెలో వుంది. ఆమెకూ పతిసేవపై ఎనలేని అనురాగం వుంది. భర్త ద్వారా ఆమెకు కొన్ని మహిమలు కూడా అలవడ్డాయి. ఆమె విషయం ఇంతటితో మరిచిపోవడం ఉత్తమం. లేకుంటే ప్రాణాలకే ముప్పు....ఇది సత్యం" అంది శాలిని అతన్ని తీవ్రంగా చూస్తూ.

శాలిని చెప్పిన మాటలు సత్యదూరం కాదనుకున్నాడు భూపాలుడు. "కేవలం ఓ ఆడదాని కొరకు అతి సామాన్యుడిలా యిలా రాజ్యాలు తిరగడమేమిటి? నా రాజ్యంలో మందాకిని కంటే మిన్నయైన కన్నెపిల్లలెందరో వున్నారు. వారందరినీ కాదని అవమానాలకూ, ఆత్మత్యాగానికీ సిద్ధం కావడం నిజంగా మూర్ఖత్వమే. నేను తలుచుకుంటే

అలాంటి అందాలు గల అతివల నెందరినైనా వివాహం చేసుకోగలను."

తనను తాను ఆత్మవిమర్శ చేసుకున్నాడు. ఆ రాత్రే తన రాజ్యానికి వెళ్ళడానికి సంసిద్ధుడయ్యాడు. ఆమె కూతురి వివాహానికి త్వరలోనే ముహూర్తం తెలియచేస్తానని చెప్పాడు. అశ్వాన్నధిరోహించి ముందుకు పోనిస్తున్నాడు.

తాలినికి భూపాలుడు చెప్పిన మాటలకు సంతోషంగా వుంది. ఆమె మనసు మరోవైపు బాధకు గురై పోతుంది అతను వెళ్ళిపోతుంటే. అతడి మనసులోని కల్మషం తొలగించిన ఘనత తనదేనని మరోవైపు గర్వం ఆమెలో లేకపోలేదు.

ం ం ం

నడినెత్తి కెక్కిన సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. బాట మీది రాళ్ళ గుర్రపు డెక్కల ధ్వనులకు ప్రతిధ్వనులను సృష్టిస్తున్నాయి. అంతకు మించి మరే సవ్వడి వినిపించడంలేదు భూపాలుడికి.

దారి కిరువైపులా చల్లని నీడనిచ్చే వృక్షాలు లేవు. రాను రాను ఎండ తీక్షణత మరింత హెచ్చింది. నిప్పుకణాల మీద నడుస్తున్నట్లుంది అశ్వానికి. అయినా వేగంగా ముందుకు వెళ్ళే ప్రయత్నం చేస్తుంది.

సుడులు తిరిగిపోతుంది దుమ్ము. భూపాలుడికీ కాసేపు విశ్రాంతి అవసరమనిపించింది దూరాన ఎత్తైన వృక్షాలు కనిపించాయి. అక్కడికి అశ్వాన్ని చేర్చాడు. దప్పికతో



గుర్రం నోరు తెరిచింది. భూపాలుడు వెంటనే దాని బాధ నర్థం చేసుకున్నాడు.

ఆ పరిసరాలను కలయజూశాడు. బెత్తెడు మందం నీటితో ఓ చిన్న కాలువ ప్రవహిస్తుంది. ముందు తన దప్పిక తీర్చుకున్నాడు. పిదప దాని దప్పిక తీర్చాడు.

ఓ ఎత్తైన వటవృక్షం క్రింద దాన్ని కట్టివేశాడు. హంస తూలికా తల్పాలపై పవళించిన మహారాజు. కఠిక నేలపై విశ్రాంతి తీసుకుంటున్నాడు. గుర్రపు డెక్కల ధ్వనితో అప్పుడే బరువుగా మూతలుబడ్డ కనురెప్పల్ని బలవంతంగా తెరిచాడు

సంజయుడు ఆపసోపాలు పడుతూ వృద్ధాశ్వంపై వచ్చాడు. స్వేదంతో అతడి శరీరంతోబాటు దుస్తులు కూడా తడిసి ముద్దయ్యాయి. అతడ్ని పరిశీలనగా చూస్తూ లేచి కూర్చున్నాడు భూపాలుడు.

"భూపాల చక్రవర్తులకు ప్రణామాలు" అన్నాడు నమస్కరిస్తూ.

ప్రశ్నార్థకంగా చూశాడు భూపాలుడు.

"మీ బాధ నాకు తెలీనిది కాదు! మీరు పిరికి వారిలా అనుకున్న కార్యం సఫలీకృతం కాకున్నా తిరుగుముఖం పట్టారు. దివ్యానందుడ్ని నాశనం చేయడమెలాగో మీకు తెలీకేగా మీ మనసులోని కోరికను చంపుకుని మీ రాజ్యానికి మీరెళుతున్నారు!" అన్నాడు సంజయుడు హుషారుగా.

భూపాలుడికి మళ్ళీ మందాకినిపై వ్యామోహం కలిగింది సంజయుడు తనపాలిట దైవంలా కనిపించాడా సమయంలో. అసలు పరాయి వ్యక్తికి తన మనసులోని

అభీష్టమెలా తెలిసింది? ఎంత ఆలోచించినా సంజయుణ్ని గూర్చి వివరాలు తెలియటంలేదు. కొంతసేపు ఆలోచించాక! అతణ్ని బాలిని యింట్లో చూసినట్లూ, విశాలికి పెళ్ళి సంబంధాలు చూసే పెద్ద మనిషినీ, యింకా అతని సంభాషణంతా స్ఫురణకు రానే వచ్చింది. "ఇంతకీ నీవు చెప్పదలుచుకున్న దేమిటో సూటిగా చెప్పు!" అన్నాడు భూపాలుడు గంభీర స్వరంతో.

సంజయుడు వ్యాపారబుద్ధిని పోనించలేదు. అతడి వ్యవహారాన్నీ-వ్యాపారబుద్ధినీ గ్రహించిన భూపాలుడు వెంటనే తన మెడలోని ముత్యాలహారం సంజయుడికి బహూకరించాడు.

సంజయుడానందంతో ఆ హారాన్ని కళ్ళకద్దుకుని తను చూసిందీ విన్నదీ అంతా ఏకరువు పెట్టాడు. అయినా, భూపాలుడికాతని మాటలపై నమ్మకం కుదర్లేదు- "సరే! నీవిక వెళ్ళవొచ్చు" అన్నాడు భూపాలుడు.

సంజయుడు వెళుతుంటే "ఆగూ! నీతో ఇంకో విషయం చెప్పాలి- ఈ విషయం ఇంకెవరికి తెలిసావో! జాగ్రత్త నీ ప్రాణాలు తీస్తాను" అనబోయి ఆగాడు భూపాలుడు. ఆ రహస్యం నిజమైతే వ్యాపార నియమాల కాశపడి ఆ వార్తనెందరికో అమ్మి సొమ్ము చేసుకుంటాడు సంజయుడు.

వెంటనే కత్తిని పైకి తీగాడు భూపాలుడు.

సంజయుడి వెన్నులో కత్తి పిడివరకూ దిగింది. చావు కేకలుపెడుతూ, రక్తపు మడుగులోపడి మృతుడయ్యాడు సంజయుడు.



ఎవరి చావు ఎలా ఎక్కడ రాసిపెట్టి వుందో ఎవరికి తెలుసు. బహుమతికి ఆశించిన సంజయుడి బ్రతుకే నేల పాలయ్యింది. అతని చావుని తనే ఆహ్వానించుకున్నాడు. మృత్యువుని వెదుకుతూ సంజయుడే ఎంతో శ్రమతో వచ్చాడు. కలుషితమైన కోరలకు మృతుడయ్యాడు.

పాముకోరల్లో పాయసమెలా వుంటుంది?

తేలుకొండిలో తేనె ఎలా వుంటుంది?

వుంటుందని భ్రమించిన సంజయుడు దివంగతుడయ్యాడు.

భూపాలుడు అశ్వానధిరోహించాడు. అశ్వం వేగంగా పయనిస్తూ వుంది.

రణధీరుడు దివ్యానందుడి ఉదరభాగంలోని నేత్రాన్ని నాశనం చేయడానికి అహర్నిశలు కృషిసాగిస్తున్నాడు. తన రాజధానీ నగరమైన కళింగను చేరాడు. కొన్ని రోజులు రాజ్యపాలన భారంతో సతమతమైపోయాడు.

అయినా, ప్రతిక్షణం ఆతని మస్తిష్కంలో మందాకిని అపురూపలావణ్య రూపమే సాక్షాత్కరిస్తూ వుంది. మందాకినిక నెలలు నిండాయి. అయినా, ఆమెపై అతనికి వ్యామోహం తీరలేదు.

మంత్రి జయంతుడు కూడా రణధీరుడి ప్రయత్నాన్ని విరమించుకోమని నమ్రతగానే పలికాడు. రణధీరుడికి మంత్రివర్యుడి మాటలు రుచించలేదు. అందుకే ఆతనిపై ఆగ్రహాన్ని ప్రదర్శించి. మరోమారు యిలాంటి సలహాయిస్తే శిరచ్ఛేదన జరుగుతుందని హెచ్చరించాడు.

దాంతో జయంతుడు మౌనాన్ని పాటించాడు. ఎవరికర్మ వారనుభవించక తప్పదనుకున్నాడు మనసులోనే.

రణధీరుడు మందాకిన్ని దూరం చేయాలనుకున్నాడు. ఎలా చేయాలో కూడా అతనికి పాలుపోవడంలేదు. గాంగాదేవి మహిమలతో కొన్ని ఘడియలాతనికి అమోఘమైన శక్తి అలవడింది.

తన రాజ్యాన్ని జయంతుడికి కప్పగించి మళ్ళీ త్రిపుర రాజ్యాని కెళ్ళాడు. మందాకిన్ని స్పృహరహితురాలిని చేశాడు. వెంటనే ఆ రూపాన్ని నిర్బంధించాడు తన దివ్యమంత్రాలతో. ఇప్పుడు ఆమె అన్యులకెవ్వరికీ కనిపించదు.

మందాకిని వేషాన్ని తను దాల్చాడు. అడుగులో అడుగు వేసుకుంటూ దివ్యానందుడున్న మందిరానికి వెళ్ళాడు రణధీరుడు.

దివ్యానందుడా సమయంలో మల్లెలు పరిచిన పసిడి శయ్యపై పవళించాడు. మెల్లగా అతని పాదాల చెంత కూర్చున్నాడు రణధీరుడు. ఆ సమయంలో దివ్యానందుని ఉదరభాగంలోనున్న దివ్యనేత్రం కనిపించింది. గంగాదేవి చెప్పిన మాటలు అనృతము కావనుకున్నాడు.

పాదాలను మెల్లగా మీటుతూనే మంత్రాలను మననం చేసుకున్నాడు రణధీరుడు అంతే! మరోక్షణంలో మత్తుగా వుండిపోయాడు దివ్యానందుడు. రణధీరుడికది మంచి అవకాశం. ఆ సదవకాశాన్ని జారవిడుచుకుంటే మళ్ళీ అతని ప్రాణాలకే ముప్పు వాటిల్లుతుంది.

అందుకే ఉదరనేత్రాన్ని చేతితో చిదిపివేశాడు కసిగా.



చివ్వున వేడిరక్తం రణధీరుడి నోటిపై, ముఖంపై చిమ్మింది.

"అమ్మా!" అంటూ తల్లడిల్లిపోయాడు దివ్యానందుడు.

ఆ ఆర్తనాదాలకు పరుగున వచ్చారు భటులు. మందాకిని ఆకారంలోనున్న అతడు "ఉన్నట్లుండి వీరి కెందులకో ఉదరకోశ వ్యాధి వ్యాపించింది. తక్షణం రాజవైద్యుల నిక్కడికి రప్పించి నా మనోనాధుని ప్రాణాలు కాపాడండి" అంటూ దుఃఖాన్ని నటించాడు.

భటులు పరుగున వెళ్ళారు.

రణధీరుడు మందాకినితోపాటు అంతర్ధానమయ్యాడు.

ఆమెను తన రాజ్యంలోని ఓ రహస్య భూగృహమందిరంలో వుంచాడు.

తెల్లవార్లూ ఆమె దివ్యతేజస్సును చూస్తూ ఆమె పాదాల చెంతే కూర్చుని కునికిపాట్లు తీశాడు రణధీరుడు.

○ ○ ○

"నాకే వైద్యుడూ, ఔషదం అక్కర్లేదు. ఎవడో మాయావి నా మంత్ర మహిమల రహస్యసారాన్ని పసిగట్టాడు. పగతో నన్ను వెన్నుపోటు పొడిచాడు. మందాకిన్ని కూడా తస్కరించాడు" బాధగా పలికాడు దివ్యానందుడు.

రాజభటులూ, వృద్ధరాజూ, మంత్రివర్యులూ, అందరూ దివ్యానందుణ్ని ఓదార్చే ప్రయత్నాలు సాగించారు. మందాకిని కొరకు అన్వేషణ ప్రారంభమయ్యింది. దేశదేశాలకూ వేగులవారెళ్ళారు.

ఆశ్రమవాసులకూ ఆ వార్త తెలిపి పరుగు పరుగున వచ్చారు

తెల్లవారిందో లేదో ఆ దేశ ప్రజలందరికీ ఆ వార్త తెలిసిపోయింది. ఆశ్రమవాసులకు ముఖం చూపించలేని స్థితిలో వున్నాడు దివ్యానందుడు.

దుఃఖసముద్ర అలలే జ్వలిస్తున్నాయి దివ్యానందుడి హృదయంపై నిర్విరామంగా కొత్త జీవితానికి ప్రాణం పోస్తున్న ఆనంద స్మృతులైనా తీరక ముందే మందాకిని ఎవరి కారణంగానో అష్టకష్టాలకు గురై పోతుంది.

ఎవరికైనా సమస్యలు ఎంత జటిలంగా వుంటాయో కృషి అంత కఠినంగా రూపాన్ని పొందుతుంది. వ్యథతో కుమిలిపోతూ, జరిగింది మననం చేసుకుంటూ కాలాన్ని వృథాచేయటం ఉచితం కాదనుకున్నాడు. తనయొద్ద తన స్వశక్తి మహిమలంటూ ఏమీలేవు. పార్వతీదేవి ప్రసాదించిన స్వల్ప విద్యలు తప్ప.

ఆమెను స్మరించాడు దివ్యానందుడు. వెంటనే పార్వతీదేవి ప్రత్యక్షమయ్యింది. "తల్లీ! పాహిమాం- పాహిమాం! మీ దివ్య కృపాకటాక్షంతో లభించిన రాజ్యం నేను అంధకార బంధురమైపోయింది. తమ కరుణాభిక్షలో లభ్యమైన మందాకిని నా నుండి దూరమైపోయింది. నా సర్వశక్తులూ హరించుకుపోయాయన్న వ్యథ నాకు లేదు మాతా! నిండు మూలాలిగానున్న మందాకినికి ఏ హాని జరుగుతుందోనని ఆందోళనగా వుంది!" దుఃఖపూరిత స్వరంతో పలికాడు.



"వత్సా! దివ్యానందా! నీవు సుఖ సంతోషాలతో దీర్ఘాయువువై స్వర్గాన్ని చేరగలవని అనిలో నీకు వరాలను ప్రసాదించాను. అయినా నీవు అష్టకష్టాలకు గురికావడం పూర్వజన్మ పాపాలకు ప్రతిఫలమే అని నేను చెప్పను. ఇదంతా గంగాదేవి నీపై కక్షబూని నీ శత్రువులైన రణధీరుడ్ని భూపాలుడులను ప్రోత్సహిస్తుంది. అయినా భీతి చెందకు! నీలో నేను ప్రసాదించిన శక్తి వుంది. నీనుండి దూరమయ్యింది నీ సాధు స్వభావమే. నీవిందిలా ఈనాటి నుండి విజయాన్ని సాధించగలవు దేశదేశాలకు నీవు రారాజువి కాగలవు. నామాట అసత్యము కాదు. ఇదిగో ఈ హారాన్ని స్వీకరించు. నీవు ఈ హార ప్రభావంతో చేరవల్సిన ప్రదేశానికి చేరగలవు. అపదలు నీ దరిదాపులకు రానేరావు. విజయలక్ష్మి నిన్నే ఆవహించి వుంది. వెళ్ళు! మందాకిన్ని రక్షించు. రణధీరుని రాజ్యంలో ఆమె బంధించబడివుంది" అంటూ ఆశీర్వదించి అంతర్థానమయ్యింది.

ఆ మాటలకు దివ్యానందుడిలో పౌరుషాగ్నులు ప్రబలాయి. మందాకిని కనిపించకపోతేచ బ్రతుకలేని ఆకాశంలో చీకటిగా మందాకిని అంతర్యంలో. ఏనాడు స్త్రీ సాంగత్యం తెలిసి తనకు సంసార బంధాలతో సన్నిధికి చేరుకుని మధురామృత స్వర్గలోకాల్లో విహరింపజేసి, అతనిలో ఆశల వలయాలను సృష్టించింది బ్రతుకుమీద శాశ్వత మధురానుభూతులను సృష్టించిన మందాకిన్ని దూరంచేసుకుంటే అతనికేదో నరకంలా వుంది.

దిక్కుతోచని, సాయం దొరకని సదిసంధ్యలో కొట్టు

మిట్టాడే తన మనసులోని చైతన్యాన్ని నిద్రలేపింది ఊర్వశి నటి.

ఇంకా ఏదో యోచిస్తోండగా భటులు భూపాలుణ్ని బంధించి తెచ్చారు.

అతన్ని చూడగానే ఎక్కడలేని ఆగ్రహం రానే వచ్చింది దివ్యానందుడిలో.

"ఈ నీచుణ్ని రాజస్థానానికి తీసుకురండి" అధికార స్వరంతో ఆజ్ఞాపించాడు.

మహామంత్రులూ, వేద పండితులూ, ప్రజలూ అందరూ సభలో ప్రవేశించారు.

దివ్యానందుడు సింహాసనాన్నధిష్ఠించాడు. భూపాలుణ్ని గొలుసులతో బంధించి ప్రభువు ముందుంచారు. సైన్యాధిపతి "ప్రభూ! పరాజయుడైన భూపాలుడు మీ వివాహకాలం నుంచి మన రాజ్యంలోనే అజ్ఞాతంగా పర్యటిస్తున్నాడు. అందులకు కారణమేమిటో మాకు సవ్యంగా తెలీనుగానీ, ఇతనేదో రాజద్రోహ నేరంగావిస్తున్నట్లు మాకనుమానంగా వుంది. అందుకే బంధించి మీ వెంటకు తీసుకువచ్చాం" అన్నాడు గంభీర స్వరంతో.

దివ్యానందుడు భూపాలుణ్ని చూసి- "మృతుడివైన నీవు మళ్ళీ ఎలా పునర్జీవుడివయ్యావు?" ప్రశ్నించాడు కొంత గంభీర స్వరంతో.

"గంగాదేవి ప్రభావంతో బ్రతికాను- మలినమైన నా మనస్సును పెడదోవన నడిపించింది దుర్బుద్ధి దేకాదు సంజయుడనే వ్యాపారుడుకూడా" అంటూ జరిగిందంతా బాధగా చెప్పాడు భూపాలుడు.



"నృపాలుడివి- హాయిగా రాజ్యపాలన చేస్తూ అష్ట ఐశ్వర్యాలనను భవించక అల్పుడిలా యిలా పరకాంతలపై వ్యామోహపడటం రాజ లక్షణమంటావా?" అడిగాడు దివ్యానందుడు!

"సిగ్గుతో తలొంచుకుని యిహపై ఎన్నడూ అలాంటి నీచ కార్యాలను తలపెట్టను- నాకు ప్రాణభిక్షను ప్రసాదించండి" చేతులెత్తి నమస్కరించాడు దీనంగా.

"సామాన్యులు కూడా నిన్ను చూసి ఛీకొడ్తారు కనుక! ఈ విషయంలో శిక్షకు తావులేదు- అయినా నీవు నృపుడివి, సాటిరాజువి కనుక. ఈ పర్యాయం ప్రాణాలతో వొదిలిపెడుతున్నాను. ఇకముందట ఎన్నడూ యిలాంటి నీచ ప్రవృత్తి నాహ్వానించకు" అన్నాడు కరుణ హృదయంతో దివ్యానందుడు.

వెంటనే భటులు భూపాలుణ్ని బంధ విముక్తుణ్ని గావించారు.

దివ్యానందుడిలో అంతటి సంస్కారం వుంటుందని కలలో కూడా వూహించలేదు భూపాలుడు. మహాశ్రీరా! తప్పులు చేయడం మానవ నైజం. వాటిని క్షమించడం దైవ ప్రభువుల సంస్కారం. కనుక! చేసిన తప్పును మరోసారి చేయకుండట ఉత్తమ మానవుడి ధర్మం" అన్నాడు దివ్యానందుడు అతన్ని పైకిలేపి.

భూపాలుడి నయనాలు సజలాలయ్యాయి. "మీలాంటి మహాత్ములు కోటికి ఒక్కరుంటారు- మీరు మీ శత్రువులను నానా క్షమాగుణాలతో ఎంతకరుణ చూపుతారో ప్రత్యక్షంగా తెలుసుకున్నాను- మీకు హాని తలపెట్టిన ఆ నీచు

దైవ రణధీరుణ్ని యీ క్షణంలోనే సంహరించగలను ఆశీర్వదించండి" అన్నాడు శాంతగంభీర స్వరంతో.

"అవసరమైనపుడు కబురు పెడతాను వెళ్ళు" అన్నాడు దివ్యానందుడు

○ ○ ○

మందాకిని నిండు గర్భిణీతో వున్న రణధీరుడు తన కోరిక చెప్పాడు. ఆమె అంగీకరించలేదు. ప్రసవవేదన రావడంతో తాత్కాలికంగా కోరిక ఆపుతున్నాడు. మందాకిని మగబిడ్డని కన్నది.

తనపై వ్యామోహం పెంచుకున్న మోహినిని పెళ్ళి చేసుకుంటానని మాయమాటలు చెప్పి దివ్యానందుడి దగ్గరకి రాయబారిగా పంపిస్తాడు. దివ్యానందుడు భార్యా బిడ్డలని యిస్తే రాజ్యం యిస్తానని మోహినికి చెబుతాడు.

తంత్రాలతో మోహినిని, దివ్యానందుడిని సంహరించాలని రణధీరుడు చూస్తాడు. అతని కుతంత్రానికి రోతపడి మోహిని దివ్యానందుడి పీడకు పోతుంది, రణధీరుడిమీది పగతో.

○ ○ ○

"భూపాలా! ఈ కళింగను నీకప్పగిస్తున్నాను. నేను ఏకాంత ప్రదేశంలో తపోదీక్షబూని ఆ నీచుడికి తగిన విధంగా బుద్ధి చెబుతాను" శాంతగంభీర స్వరంతో పలికాడు దివ్యానందుడు.

"స్వామీ! నాకింతటి భారం తగదు. ఈ రాజ్యం మీది. కాంక్షతో దీన్ని భరించడానికి నాకు శక్తి చాలదు" అన్నాడు వినయపూర్వకంగా భూపాలుడు.

---



"మోహినీ! ఈ రాజ్యకాంక్షతోనేకదా అలనాడు నీ వెన్నో చేయరాని నేరాలెన్నో చేశావు! చివరకు నీమనసు తెలిసినా రణధీరుడికే తిరిగి కళింగనందించాలనుకుని మోసపోయావు. నా హస్తం లేదని బాధపడకు. నీవు ప్రజాపరిపాలన చేయడానికి అర్హురాలివి. కళింగను నీకే అప్పగించాలనుకున్నాను. కాదనకు."

మోహిని కంటి తడితో చూపింది దివ్యానందుణ్ని.

"క్షమించండి స్వామీ! ఆడదాన్ని అబలను మహారాణిని కావాలని చేయరాని ఘోరాలెన్నో చేసినందుకే నాకీ శిక్ష విధించాడా విధాత. ఇప్పుడు నాకే ఆశలూ లేవు. తమకు ఊడిగం చేస్తూ నా శేష జీవితాన్ని గడపాలనుకున్నాను" అంది వైరాగ్యం నిండిన స్వరంతో.

"మోహినీ! ఏ అచ్చటా ముచ్చటా తీరకముందే ఐహిక సుఖాలను త్యజించినంత మాత్రాన స్వర్గ ప్రాప్తించదు. సంసార సుఖ బంధాలను పొంది పిల్లా జల్లల యోగక్షేమ సంద్రంలోని లోతులను తెలుసుకుని ఆనందంగా, సుఖంగా కైలాసం చేరడం ఉత్తమం" భూపాలుడికేసి తిరిగి. "భూపాలా! మోహిని అభీష్టం నీకు తెలియనిదికాదు. రాజధానికి మహారాణిగా ఉండిపోవాలనుకున్న ఆమె వాంఛను నీవు తీర్చాలి. ఈ కళింగను నీకే కానుకగా హృదయపూర్వకంగా సమర్పిస్తున్నాను" అన్నాడు ప్రశాంత స్వరంతో దివ్యానందుడు.

"నేను నా రాజ్యాన్ని సురక్షితంగా చూసుకోడమే గొప్ప. అలాంటిది మీరు నన్ను కళింగకు రాజును చేయ

దంతో ఆధారం మరింత అధికమౌతుందని తమకు ముందే విన్నవించుకున్నాను" భూపాలుడు మళ్ళీ అదేమాట చెప్పాడు

"భూపాలా! నృపాలుడివి ఇలాంటి రాజ్యాలను నందనైనా తీసుకునే శక్తి సహజ క్షత్రియుడివైన నీకు వుండటం సహజం. నామీద నీకేమాత్రం గౌరవాభిమానాలున్నా- నా మాటను నిరాకరించక మోహినిని వివాహమాడు. అదే సమయంలో ఈ రాజ్యానికి పట్టాభిషిక్తుడివి కమ్ము."

"మహాత్మా! ఎంతమాటా! మీ మాటంటే నాకు ఎంత గౌరవమో మీకు మాత్రం తెలీదా? మీ ఆజ్ఞను నేను సర్వదా శిరసా వహిస్తాను. మోహినీని నా అర్ధాంగిగా స్వీకరిస్తాను" రెండు చేతులతో నమస్కరించాడు భూపాలుడు.

మోహిని హృదయంలో ఆనందపుష్పాలు చిగురించాయి.

చిరునవ్వులతోబాటు సిగ్గుకూడా ఆమె ముఖ పద్మంలో తాండవమాడింది. వెంటనే తన చేతుల్తో ముఖాన్ని దాచుకుంది.

ఓ సుముహూర్తంలో!

మోహినీ భూపాలుడి వివాహం జరిగింది. ఆ సమయంలోనే భూపాలుడికి తానిచ్చిన వాగ్దానం గుర్తొచ్చింది. వెంటనే [illegible], విశాలిని కళింగకు రప్పించాడు. విశాలికి అన్నివిధాలుగా యోగ్యుడైన భర్తనిచ్చి వివాహం జరిపించాడు. ముందు అనుకున్న విధంగానే విశాలి వివాహం ఘనంగా సేనాధిపతితో జరిగింది.

"అదే సమయంలో! కళింగదేశ చక్రవర్తి అయ్యాడు భూపాలుడు.



అన్ని బాధ్యతలూ తీరాక నిశ్చింతగా కారడవులకు బయల్దేరాడు దివ్యానందుడు.

దివ్యానందుడు వారందరినీ వొదలి వెళుతున్నందుకు బాధగా వుంది.

అయినా తప్పదు! రణధీరుడ్ని సంహరించడానికంత కంటే మార్గంలేదు.

ం ం ం

"ఏమిటి నాపై పరీక్ష - నా రాజ్యానికి అధినేతగా మారాడా మిత్రద్రోహి భూపాలుడు? నేను ఎంగిలి చేసిన స్త్రీని విశాల హృదయంతో అర్ధాంగిగా స్వీకరించాడా సిగ్గూ, లజ్జాభిమానాలులేని నృపాలుడు.... అయినా ఓ విధంగా ఇదికూడా నా మంచికే జరిగింది. మోహినినీ, భూపాలుడ్ని పీడించడానికిది సరియైన సమయం. దివ్యానందుడ్ని ఎప్పుడు ఏ విధంగా భగ్నం చేయాలో నాకు బాగా తెలుసు" అనలోతానే తర్కించుకుంటూ మత్తు పానీయాలను సేవిస్తున్నాడు.

అతని ఊరువులపై ఇరువురు సుందరాంగులు హాయిగా వాలకబోస్తున్నారు. వారందరిచే మధుపానం కూడా స్వీకరించాడు. వెంటనే గాల్లో ప్రయాణం సాగించాడు.

కళింగ అంతఃపురంలో అప్పుడే మోహిని చెలికత్తెలతో కలిసి సింగారించుకుంటోంది. ఆమె శరీరంపై ఖరీదైన ఆభరణాలు ధగధగా మెరిసిపోతున్నాయి. ఆమె వాల్జడను చక్కని సంపెంగ పూలతో నక్షత్రాల్లా పేర్చి తీర్చిదిద్దుకున్నారు చెలికత్తెలు.

అద్దంలో ఆమె అందాలను తనివితీరా చూసుకుని మురిసిపోతుంది. ఉన్నట్లుండి అకస్మాత్తుగా 'కెవ్' న కేకేసింది.

అద్దంలో మాత్రం రణధీరుడి ఆకారం కనిపిస్తోంది అతన వికృతంగా దరహాసం చేస్తున్నాడు.

చెలికత్తెలు భయభ్రాంతులై పారిపోయారు

మోహినికూడా స్పృహ రహితురాలయ్యింది వెంటనే అమె ముందు ప్రత్యక్షమయ్యాడు రణధీరుడు. అమె మృదువైన భుజస్కంధాల నందుకున్నాడు. అమె జడలోని మల్లెల పరిమళాలను ఆఘ్రాణించాడు, ఆమెను తన మం దానికి తీసుకువెళ్ళే ప్రయత్నంలో వున్నాడు.

అదే సమయంలో అతని వెన్నుపై ఎవరో కత్తి మోపారు.

రణధీరుడి గుండెలు ఝలదరించాయి. అద్దంలో ఆ ఆకారం ఎవరిదో గ్రహించాడు. సైన్యాధిపతి క్రూరంగా చూస్తున్నాడు. "నీవు ఒకప్పుడు నా దాసివని మరిచావు. నన్ను అడ్డుకొనే సాహసం నీలో వుందా?" అన్నాడు రణధీరుడు.

"నీ చావు ఇప్పుడు నా చేతుల్లో వ్రాసివుంది. నిన్ను రక్షించే వాడెవడీ ప్రపంచంలో వున్నాడా?" అన్నాడు కోపంగా. రణధీరుడు మాయోపాయంతో అంతర్ధానమయ్యాడు.

"తప్పించుకున్నాడు నీచుడు!" అన్నాడు సైన్యాధిపతి యుగంధరుడు.

అప్పటికే ఆ వార్త తెలిసిన భూపాలుడూ మందిరాని చేరుకున్నాడు. అప్పుడే నిద్రనుండి లేచినదానిలా మోహిని కళ్ళు తెరిచింది. భూపాలుడ్ని సజల నయనాలతో భయంగా వాటేసుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. అమె వెన్ను నిమురు అమెలో ధైర్యాన్ని నూరిపోశాడు భూపాలుడు.



"యుగంధర్! నీవే లేకుంటే మహారాణి మోహినీదేవిని ఆ నీచుడు తస్కరించి ఎన్నెన్ని అవమానాలకో గురిచేసేవాడు. ఇకనుండి నీవు సైన్యాధిపతివే కాదు. ఈమెకు అంగరక్షకుడిగా కూడా వ్యవహరించాలి" అన్నాడు భూపాలుడు.

"మహా ప్రసాదం" అంటూ శిరస్సు వొంచి నమస్కరించాడు.

యుగంధర్ అక్కడ్నుంచి నిష్క్రమించాడు. అమెను తన ఏకాంత మందిరానికి నడిపించుకెళ్ళాడు

భూపాలుడు రోజురోజుకూ ఆందోళనలతో కృశించిపోతున్నాడు. రణధీరుడు కళింగలోని కన్యలందరినీ తస్కరిస్తున్నాడు. ప్రజల్లో కల్లోలం బయలుదేరింది. రాజ్యంలో దోపిడీలూ, దొంగతనాలూ ఎక్కువయ్యాయి.

ప్రజలకూ ప్రభుత్వానికీ మధ్య ఉద్యమజ్వాలలు అధికమయ్యాయి. భూపాలుడి రాజ్యపాలన ప్రజలకు నచ్చలేదు. ముఖ్యంగా రాజ్యంలో ఏ అరాచకం జరిగినా రణధీరుడే చేయిస్తున్నాడన్న విషయంలో ప్రజలు విముఖత చూపిస్తున్నారు ప్రభువుపై.

అందుకే! సైన్యంపై తిరుగుబాటు సాగిస్తున్నారు ప్రజలు. ఫలితంగా కొన్నివందల ప్రాణాలు ఇరువర్గంలోనూ ఆహుతై పోతున్నాయి. రోజు రోజుకూ రక్తపాతం అధికమయ్యింది. ప్రజా సమస్యలను పరిష్కరించలేని పాలకుడు గద్దె దిగాలంటూ ప్రజలు రెచ్చిపోతున్నారు.

ఇదంతా భూపాలుడికి భారంగా, బాధగా ఉంది. అక్కడికీ రాజ్యంలో అనేక కట్టుదిట్టాలు చేశాడు, చెరువుకు వెళ్ళిన కన్యలు ఇంటికి తిరిగి రావడంలేదు. బజారుకు వెళ్ళిన

వారూ అంతే! ప్రజలు కన్యలను ఇంట్లోంచి బైటికి రానివ్వడంలేదు. అయినా వారు మాయమైపోతూనే ఉన్నారు.

"అందుకే! భూపాలుడు గంగాదేవి కొరకు దీక్ష బూనాడు. ఆమె ప్రత్యక్షమయింది. ఆమె పాదాలను కన్నీటితో స్నానం చేయించి జరిగిందంతా విన్నవించుకుని పరిష్కార మార్గం చెప్పమని అర్థించాడు.

"నృపుడా! నీవు రణధీరుడికో విధంగా మిత్రుడివి. అతనికి వ్యతిరేకి మిత్ర ద్రోహం చేస్తున్న నీకు దేవి విధంగా సహాకరించను" అంది గంభీర స్వరంతో అతన్ని సూటిగా చూస్తూ.

"అమ్మా! ప్రజలందరూ నీ కన్నబిడ్డలాంటి వారు. ఒకరి స్వార్థానికి రాజ్యంలోని ప్రజలందర్నీ శిక్షించడం న్యాయమంటావా?" దీనంగా ప్రశ్నించాడు భూపాలుడు.

"నీవు దివ్యానందుడిపై వ్యామోహాన్ని చంపుకోవాలి. అంతేకాదు! అతన్ని రాజ్యంలో వుంచకూడదు. అందాకా నీకన్ని సమస్యలు సర్పాల్లా కాటువేయక తప్పదు" అందామె దృఢ నిశ్చయంతో.

"మాతా! కన్నతండ్రినైనా ఏ పుత్రుడైనా మరువగలడా! జన్మను ప్రసాదించిన భగవంతుడ్ని మరచుట ఎంత పాపమో నీకు తెలియదా తల్లీ. నిజానికి ఏనాడో నా ప్రాణాలు దివ్యానందుడి చేతుల్లో హరీ అనేవి. ఆ మహాత్ముని కరుణాభిక్ష కారణంగా మళ్ళీ ఓ విధంగా నాకు పునర్జన్మ వచ్చింది. అలాంటి కరుణామయుడ్ని నేనెలా విస్మరించగలను?"

"దివ్యానందుడిమీద నీకున్న భక్తి విశ్వాసాలకు సంతో-



షించాలో, ఆగ్రహించాలో పాలుపోవడంలేదు నాకు. ప్రస్తుతం దివ్యానందుడు నా ప్రధాన శత్రువని నీవు మరిచి, నీవు నా సాయాన్నర్థించడంలో అర్థంలేదు. నన్ను రక్షించడం నావల్లకాదు అనుభవించు" అంటూ మాయమైపోయింది.

భూపాలుడు దుఃఖావేశంలో ఉన్నాడు.

అప్పటిదాకా జరిగిందంతా విన్న మోహిని అతని సన్నిధికి చేరుకుంది. ఆమెను సజలనయనాలతో చూశాడు.

"మోహినీ! నీ నిర్ణయమేమిటి?" ప్రశ్నించాడు.

"మీ నిర్ణయమే నా నిర్ణయం ప్రాణనాథా!" అంది బరువు స్వరంతో.

ఆమె బలంగా గుండెలకు హత్తుకుని "నీలాంటి ఉత్తమ సతిని పొందడం నిజంగా నా అదృష్టం" అన్నాడు ఆమె వెన్ను ప్రేమగా నిమురుతూ అతను వొలిన కన్నీరు వేడిగా ఆమె వీపుమీది నుండి జారుతుంది.

ఆమె కంటినుండి రాలిన అశ్రుబిందువులతని గుండెలపై నిలిచాయి.

ఒకరొకరు చూసుకుంటూ కొంతకాలం వున్నారు.

"తర్వాత రోజురోజుకూ ఈ అరాచకాలూ, మారణహోమాలూ అధికమౌతున్నాయి మోహినీ! వీటిని పరిష్కరించడం ఎలాగో నాకు పాలుపోవడంలేదు. అందుకే నేనో నిర్ణయానికొచ్చాను" అన్నాడు ఇటువైపు తలతిప్పి.

ప్రశ్నార్థకంగా చూపింది మోహిని.

"మోహినీ! ఈ కళింగ ఆ కసాయి వాడిదని నాకు తెలుసు. అందుకే! రణధీరుడు సహించలేక మాయోపాయా

లతో మనల్ని చిత్రవధలకు గురిచేస్తున్నారు. అందుకే మనం ఈ రాజ్యాన్ని వీడి నా రాజ్యానికెళదామా" అన్నాడు కాస్త బాధగా.

"ఎంత మాటలన్నారు? దివ్యానందస్వాములవారు ప్రసాదించిన ఈ రాజ్యాన్ని కాళ్ళదన్నుకుని వెళ్ళినంత మాత్రాన ఆ పరమ కిరాతకుడు మీపై కక్ష సాధింపు మానుకుంటాడనే విశ్వాసం మీకుందా?" కాస్త ఆవేశంగా పలికింది మోహిని.

భూపాలుడు మౌనం పాటించాడు. అదే సమయంలో వంగవేశంనుండి మంత్రి త్రిశంఖుడు రానే వచ్చాడు. అతని ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తూ వుంది. "ప్రభువులు క్షమించాలి మీరిక్కడే ఉండటం క్షేమకరం కాదు. మన రాజ్యమంతా రక్త ప్రవాహంతో నిండిపోయింది. ప్రతిరోజూ రక్తపాతం జరుగుతూ వుంది. ప్రజల్లో అసంతృప్తి జ్వాలలు చెలరేగాయి. ప్రజలకు ప్రభువులపై నున్న గౌరవ మర్యాదలన్నీ మంట గలిశాయి. భయాందోళనలకు కన్యలు శీలరహితులు అవకముందే ఆత్మహత్యలకు ఒడిగట్టారు. ఇంకా మీరు ఉపేక్షిస్తే రాజ్యంలో ఎన్నెన్ని మారణహోమాలు జరుగుతున్నాయో తలుచుకుంటూనే భయమేస్తూ వుంది" అన్నాడు భీతిస్వరంతో.

"రణధీరుడి రాక్షసత్వం ఆ రాజ్యంలో కూడా చెలరేగిదన్నమాట" ఆగ్రహావేశాలతో పలికాడు భూపాలుడు.

"చూశారుగా ప్రభూ! ఈ రాజ్యాన్ని వీడి ఆ రాజ్యాకెళ్ళాలనుకున్నారు మీరు. నా ఊహ ఇప్పటికైనా నిజమ



మీరు విశ్వసిస్తున్నారా!'' తీవ్రంగా చూస్తూ పలికింది మోహిని.

"దేవీ! నీవూహించినట్టే అంతా జరిగిపోయింది. ఇప్పుడీ పరిస్థితులనెలా ఎదుర్కోవాలో నీకేమైనా యోచన వుంటే సెలవియ్యి!" ఆందోళనగా ఆమెను చూశాడు.

''నాకూ ఈ క్షణంలో ఏ ఊహా తట్టడంలేదు. మన సైనికులే కాదు. అవసరమనుకుంటే దివ్యానందులవారి సైన్యాన్ని కూడా మన ప్రజలకు రక్షణ కల్పించినా, ఆ రాక్షసుడి కిరాతకాలకు అనకట్ట కట్టలేము."

అంతలో మరో ఇరువురు భటులు రానే వచ్చారు పరుగు పరుగున.

"ప్రభువులు క్షమించాలి మన రాజ్య సరిహద్దులో మాసుమైన కన్యల శవాలన్నీ గుట్టలు గుట్టలుగా పడి వున్నాయి. ప్రజలంతా ఆ హృదయ విదారక దృశ్యాలను తిలకించి రాజ్యాన్ని ముట్టడించే ప్రయత్నం సాగిస్తున్నారు. మన సైన్యం వారినడ్డుకునేందుకు శక్తివంచన లేకుండా కృషి చేస్తుంది" అన్నాడో భటుడు ఆందోళనగా.

"ప్రభూ! ఉపేక్షించకండి! ఈ మారణహోమాన్నరికట్టండి" ఇంకో భటుడు అర్థించాడు.

త్రిశంఖుడు తీక్షణంగా యోచిస్తున్నాడు. "మంత్రివర్యా! చూశారుగా ఓ దుష్టుని కారణంగా ద్వేషాల్లో ఎంతటి క్లిష్ట సమస్య లేర్పడ్డాయో.... మీరైనా చెప్పండి స్థితినెలా పరిష్కరించాలి" ఏకాంత మందిరంవైపు పయనించాడు భూపాలుడు.

త్రిశంఖుడు ఆయన్ను అనుసరించాడు. భటులకు ఏం శాసించాలో తెలీక మోహిని తలొంచుకుని "సర్వ సైన్యంతో

రాజధాని రక్షణకు అన్ని ఏర్పాట్లూ చేయమని యుగంధర
మా ఆజ్ఞగా చెప్పండి" అధికార స్వరంతో పలికిం
బాధగా.

వాళ్ళు వెళ్ళిపోయాక తను తన మందిరంలో ప్రవేశించిం
గుండెలు 'ఝల్' మన్నాయి. 'కెవ్'న కేకేసింది. వెంట
మంది భటులు రానే వచ్చారు. కానీ, ఈలోగా జరగ
దంతా జరిగిపోయింది.

అప్పటికే మోహిన్ని రణధీరుడు తప్పించు
పోయాడు.

ఆ విషయం భటుల ద్వారా తెలుసుకున్నాడు భూపాల
ఆగ్రహ జ్వాలలు మనస్సులో సుడులు తిరిగాయి. ఇలా
స్థితిలో ఉన్న ప్రభువును ఓదార్చే ప్రయత్నం చే
"ప్రభూ! దీపం చివరి దశలో ఒక్కసారి భగ్గుమం
గొప్ప కాంతినిస్తుంది. రణధీరుడి పాపాలు కూడా అం
దశకొచ్చి ఒక్కసారిగా మృగంలా విజృంభించాడు.
స్థితిలో మీకు అవసరమైంది ఆగ్రహం కాదు. అలో
దివ్యానందులవారి తపస్సును భగ్నం చేయజూచిన ఆ దు
డుకు అడ్డుకట్ట వేసిన గౌరీదేవినే మీరు శరణు వేడుకో
కింకే మరో మార్గమే కనిపించడం లేదాయే" అన్నా
ప్రశాంత స్వరంతో త్రిశంఖుడు భూపాలుడికి మాటల
కొత్త చైతన్యం కలిగించా.

"అవును మంత్రివర్యా! ఆమాటే ఇంతవరకు స్ఫుర
రాలేదు. తక్షణమే మీరు ఉమాదేవి ప్రార్థనా మందిర
పూజకు కావాల్సినవన్నీ సిద్ధం చేయండి. ఈలోగా



స్నానాదులు ముగించుకుని వస్తాను" అన్నాడు అటువైపు కదుల్తూనే.

త్రిశంఖుడు భటుల ద్వారా వెంటనే పూజకు కావాల్సినవన్నీ ఏర్పాటు చేశాడు. మహారాజు ఈలోగా రానే వచ్చాడు. రక్షణకోసం తగు సిబ్బందినేర్పాటు చేశాడు త్రిశంఖుడు.

భూపాలుడు భీకరంగా ఉమాదేవిని ధ్యానిస్తూ ఉన్నాడు.

ఎక్కడున్నాయో భయంకరంగా సుడిగాలులు విజృంభిస్తూ పరదాలను చెల్లాచెదురు చేస్తున్నాయి. పార్వతీదేవి విగ్రహం ముందున్న నూటొక్క దీపకాంతులు అంత గాలివీస్తున్నా చలించలేదు. రణధీరుడి విద్యలూ మహిమలూ గుమ్మం కూడా దాటనంలేదు.

ఆగ్రహంతో వచ్చినదారినే వెళ్ళిపోయాడు రణధీరుడు.

త్రిశంఖుడికీ, తదితరులకూ రణధీరుడి మాయా వికారాలు కనిపించాయేకదా రూపం కనిపించలేదు. కనిపిస్తే వారంతా రణధీరుడ్ని ముక్కలు ముక్కలుగా చేయాలనుకున్నారు. కానీ వారి కోరిక తీరలేదు.

పార్వతీదేవి భూపాలుడు నిష్కల్మష హృదయంతో దీక్ష బూనాడు కనుక వెంటనే సాక్షాత్కరించింది. వెంటనే ఆమెను స్తుతించాడు కర్ణప్రియంగా. ఓ విధమైన ప్రళయం తన రాజ్యాల్లో ప్రజ్వరిల్లుతున్నా ఆమెను మెప్పించడానికి ఎంతో ప్రియంగా స్తుతించడంతో పార్వతీదేవికూడా పరమానంద భరితురాలై —

"వత్సా! నీ అభీష్టం నాకు తెలియనిది కాదు. ఇకపై నీ రాజ్యాల్లో ఎలాంటి కల్లోలాలూ జరగవు. దివంగతులైన తన్యులందరూ తమ తమ నిధులకేతెంచి మళ్ళీ ఆనంద

జీవితాన్ని పొందగలరు. అంతేకాదు! రణధీరుడి చెరలో బంధింపబడిన అవివాహితులు కూడా ఎవరెవరి ఇండ్లకు వారు చేరుకుంటారు. ప్రజలందరూ నిన్ను, మీ గొప్పవాళ్ళ వాళ్ళను అర్థం చేసుకుని క్షమాభిక్షను వేడుకొంటారు. కానీ, మోహిని ఆ వీరుడి చెంతనే వుండటం ఉచితం. మందాకినికి తోడుగా వుంటూ, ఆమెకు ధైర్యాన్ని ప్రసాదిస్తూ ఆమె పుత్రరత్నానికి పరిచర్యలు చేస్తూ ఉంటుంది" అంది శ్రావ్యంగా.

"మాతా! మోహిని మందాకినికి తోడుగా ఉండటానికీ, ఆమె పుత్రుడికి పరిచర్యలు చేయడానికి నాకెంత మాత్రమూ అభ్యంతరం లేదు. కానీ, ఆ వీరుడామె మాన ప్రాణాలతో చెలగాటమాడితే!" పూర్తిగా తన సందేహాన్ని చెప్పాడు భూపాలుడు.

"ఆ భయం నీకక్కర్లేదు. మోహినిద్వారే రణధీరుడు మృతుడవుతాడు" అంటూనే అంతర్ధానమయ్యింది. ప్రక్కనే భటుడు కూడా ఆ మందిరంలోంచి వెలువడిన మాటలు విన్నాడు. ఇప్పుడు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.

భూపాలుని ముఖం ఆనందంతో కళకళలాడుతూ ఉంది.

"మంత్రివర్యా! ఇహ మీరు వంగ దేశానికెళ్ళవచ్చు. అక్కడి పరిస్థితులనెప్పటికప్పుడు మాకు తెలియజేస్తూ ఉండండి. ఇకపై ఎలాంటి అరాచకాలు జరగవు" అన్నాడు సంతోషం నిండిన కళ్ళతో చూస్తూ.

"ప్రభూ! జరిగిందంతా విన్నాను. ఇహపై నాకెలాంటి చీకూ-చింతలుండవు" అంటూ నమస్కరించి వెళ్ళాలని అడుగు ముందుకేశాడో లేదో, భటుడు ఆయాసంగా పరుగెత్తుతూ వచ్చాడు.



"ప్రభూ! వైరంలో మృతులయిన వారందరూ పునర్జీవులయ్యారు. ఇళ్ళలోంచి మాయమైన కన్యలంతా తిరిగి ఆనందంగా ఎవరిళ్ళకు వారేతెంచారు. ప్రజలందరూ తమకు క్షమార్పణలు సమర్పించాలని పుష్పమాలలతో అనేక కానుకలతో రాజధాని కొచ్చారు వెల్లువగా. మీ దర్శనార్థం అందరూ ఎదురు చూస్తున్నారు" అన్నాడు భటుడు సంతోషంగా.

భూపాలుడికీ ఆనందంగానే వుంది. వారందరి మన్ననలూ, అభిమానాన్నీ పొందాలన్న కాంక్ష వుంది. కానీ, అందు కెందుకో విముఖత చూపుతున్నాడు.

"ఇప్పుడే నేను వారి ఆదరాభిమానాలకు పాత్రుడను కాను. ఇన్నాళ్ళూ జరిగిన ఘోరాలకు నేను వారికి ముఖం చూపించలేకపోయాను. ప్రభువుల స్వవిషయాలు ఇంకా తీరలేదనీ. అందాక ప్రభువులు ప్రజలకు ముఖం చూపించలేరని మామాటగా ప్రజలకు విన్నవించండి" అన్నాడు నుదుటిపై పిడికిలిని మోపి.

భటుడు వెళ్ళాడు. ప్రభువుల నిర్ణయాన్ని ప్రజలకు తెలియజేశాడు.

"వీల్లేదు! ప్రభువులు మాకు కనిపించాలి!"

"దైవంలాంటి ప్రభువులకు క్షమార్పణలు చెప్పందే కదలము."

"అవును! అలాంటి పుణ్యపురుషున్ని అపార్థం చేసుకున్నందుకు క్షమార్హులం కాదు. వారు మమ్మల్నే శిక్షకు పాత్రుల్ని చేసినా సహించగలము."

"అంతేగానీ. మమ్మలను ఇక్కడ్నుంచి ఎవ్వరూ వెనక్కు పంపలేరు."

ప్రజలు ఆనందోత్సాహంతో రెచ్చిపోయారు. వారి కేకలూ, జేజేలు భూపాలుడికీ, త్రిశంఖుడికీ వినిపిస్తూ వున్నాయి. అయినా, భూపాలుడింకా ముభావంగానే వున్నాడు

"ప్రభూ! ప్రజలు అమాయకులు. వారికి ఆవేశమొచ్చినా ఆనందమొచ్చినా, అన్నింటినీ సహించగల ఓర్పు మీలో వుండాలి. అందుకే మిమ్మలను ఈ సామ్రాజ్యాధినేతగా ప్రజలంతా భావించారు. వారి సంతోషాన్ని మన్నించండి. వారికి మీ దర్శనభాగ్యాన్ని కలిగించండి" అన్నాడు వినయ పూర్వక స్వరంతో త్రిశంఖుడు

మహారాజు రాజాస్థానాన్ని చేరుకున్నాడు.

ప్రజల జేజేల నినాదాలతో ఆ మందిరమంతా ప్రతిధ్వనించిపోతుంది. త్రిశంఖుడు వారందరినీ మౌనం పాటించేలా చేతులతోనే సైగచేశాడు. ప్రభువులు సింహాసనంపై కూర్చున్నారు. సభికులంతా తమతమ స్థానాల్లో ఆసీనులయ్యారు.

"ప్రజామూర్తులారా! నాపై మీరు చూపిస్తున్న అభిమానానికి మీ అందరికీ జోహార్లు. ఇన్ని రోజులూ మనమంతా అనుభవించిన బాధలన్నీ నేటి నుండి తీరిపోయాయి మీ కెలాంటి ఆపద ఇకమీదట జరగదు.... మీరంతా ఒకప్పుడు ఆగ్రహంతో రెచ్చిపోయారు. నన్ను అసమర్థుడినని అవిశ్వాసుడననీ, అవమానానికి లోనుచేశారు. చివరకు మాతో ఉద్యమానికీ, సమరానికీ సంసిద్ధులయ్యారు. మరణ



సంఖ్య పెరిగిపోయింది. ఇలాంటి స్థితిలో దైవం నన్ను కరుణించింది. పార్వతీదేవి కృపకారణంగా మీరుపొందిన ఆవేదనంతా ఆనందంగా రూపుదాల్చింది ఇందులో నేను మిమ్మలను క్షమించేంతటి తప్పులు మీరెవ్వరూ చేయలేదని నాకు తెలుసు. ప్రభువుల కర్తవ్యమేమిటో తెలియచేశారు. అందుకు నేనే మీరందరికీ కృతజ్ఞతలు తెలపాలనుకుంటున్నాను. ఇకపోతే మీరు ఆనందంగా నా కందిలచాలనుకున్న పుష్పమాలలన్నీ ఆలయంలోని గౌరీశంకరుల కలంకరించండి. కానుకలు బీదవారికి పంచిపెట్టండి. అంతకు మించిన ఆనందం నా కేమీ వుండదు. నా మాటను మీరు శిరసావహిస్తే మీరు నన్ను గౌరవించిన వారవుతారు. అభిమానించిన వారవుతారు" అన్నాడు ప్రశాంతత స్వరంతో సింహాసనం మీంచి పైకిలేస్తూ.

ప్రజలందరూ జేజేలు పలుకుతుండగా భూపాలుడందరికీ నమస్కరిస్తూ అక్కడ్నుంచి నిష్క్రమించాడు. త్రిశంఖుడు కూడా వంగదేశానికి ఆనందంగా పయనమయ్యాడు.

భూపాలుడి మనసు యిప్పుడు ప్రశాంతత నొందింది.

ం ం ం

కన్యలందరూ మాయమయ్యే సరికి కలవరపడిపోయాడు రణధీరుడు. తను ఆగ్రహంతో మళ్ళీ గంగాదేవిని స్మరించాడు. గంగాదేవి ప్రత్యక్షమయ్యింది.

"మాతా! శత్రువులకింతటి సాహసం రావడం నేను భరించలేను" అన్నాడు భీకర స్వరంతో

"రణధీరా! నీ ఉద్దేశ్యం శత్రువులవమానించేదే అయితే నేను నీ కోరకను మన్నించేదానిని. నీవు కామలోలుడివి.

కన్యలను బంధించి సాటిశతృవులను కించపరిస్తే సంతోషి చేదానని. పాపభూయిష్ఠంతో వారి మాన ప్రాణాలతో చెలగాటమాడ్డం క్షమించరాని నేరం. వారందరూ పాపం తెలీనివారు. వారిని హింసించడంలో అర్థంలేదు ఇకపై ఇలాంటి ఘోరాలు చేయడం నేను సహించను" ఉక్రోషంగా అంటూనే అంతర్ధానమయ్యింది

రణధీరుడిలో అశాంతి చెలరేగింది ఇకపై ఇలాంటి ఘోరాలు.... అంటే నేను మందాకిన్నీ, మోహిన్నికూ కలుషితం చేయరాదని ఆమె భావనా? లేక రాజ్యంలో ఎలాంటి కల్లోలాన్ని సృష్టించకూడదని ఆమె మందలించిందా?" ఆలోచనలతో అతని మస్తిష్కం వేడెక్కిపోయింది.

మోహినిపై వ్యామోహమున్నా సాహసించలేక పోన్నాడు. రణధీరుడు గంగాదేవికీ తను శత్రువు కారాదకున్నాడు. అందుకే! మోహినిపైనున్న వ్యామోహాన్ని తాత్కాలికంగా చంపుకున్నాడు.

మధువును హుషారుగా త్రాగుతున్నాడు.

మల్లెపూవల్లాంటి మగువలు దిగంబరంగా అతని ముంనృత్యం చేస్తున్నారు. వారందరి తీపి అవహాన్వితంతో వేడి దేహాలతో మైమరచి పోతున్నాడు. సుఖాల పల్లకీ ఆనందయాత్ర సాగిస్తున్నాడు.

మోహిని జరిగేదంతా చూస్తోంది. ఆమె వొళ్లం క్రోధంతో మండిపోతోంది. అయినా, ఆ నీచుడి కళ్ల కనిపించకుండా దూరంగా వెళ్ళింది.



సమయంచూసి కాగడాతో మోహిని రణధీరుడ్ని హత్య చేయాలని ప్రయత్నించి దొరికిపోయింది.

ఆమెని చంపకుండా శత్రువుని దెబ్బ తీయడానికి ఉపయోగించుకోవాలనుకున్నాడు.

మోహినికూడ పైఎత్తు వేసింది. చాపక్రింద నీరులా దావుదెబ్బ తీయాలని చూసింది.

దివ్యానందుడి తపస్సు భగ్నం చేయడానికి రణధీరుడు మునీశ్వరులను బాధించసాగారు.

ఓ వృద్ధ మునీశ్వరుడు ఆవేశంగా పలికాడు.

రణధీరుడాతని చెంతకు వచ్చాడు. "ఇప్పుడు నీ కళ్ళనూ, నాలికనూ కోసి ముక్కలు చేస్తాను. అప్పుడే నా మీరు నమ్ముకున్న భగవంతుడు మీ మొర ఆలకిస్తాడేమో చూస్తాను" అంటూ ఆ వృద్ధుడి కళ్ళనూ, నాలికనూ నేలపాలు చేశాడు.

"దుర్మార్గుడా! తండ్రిలాంటి శత వృద్ధుడిపైనా నీ ప్రతాపం" ఓ యువకుడు కోపాగ్నులతో రెచ్చిపోయాడు. రణధీరుడు ఆ యువకుడి చెంతకు వచ్చాడు. అతన్ని మింగేవాడిలా చురచురా చూశాడు.

"నీవు నాతో సమరం చేయగలవా?" అడిగాడు రణధీరుడు.

"రాజ్యాన్ని రక్తపాతం చేయడం. కత్తితో యుద్ధం చేసి జీవహింస చేయడం కర్కశుడివైన నీకే చెల్లు. నాకే కత్తి యుద్ధంలో ప్రవేశం ఉండివుంటే ఈ పాటికి నీ శిరస్సును వెయ్యి ముక్కలుగా నరికే వాడిని" ఆవేశంతో పలికాడా యువకుడు.

"మూర్ఖుడా! నన్ను సంహరించే సాహసం, వీరత్వం నీలో వుందా?" అంటూ ఖడ్గంతో ఆ యువకుడి శిరస్సును 'సక్' మనిపించాడు- బంతిలా గాల్లో ఎగురుతూ నేలమీద దొర్లిందా యువకుడి తల. అతని మొండెంలోంచి చిప్పిన వేడిరక్తం వెదజల్లుతూ వుంది.

ఆ యువకుడి తల నేలమీదపడి నోరు తెరిచింది- కళ్ళు క్రోధంగా ఉన్నాయి. మొండెం కాళ్ళూ, చేతులూ కొట్టుకుని ఎగిరెగిరి పడుతోంది. ఆ ధాటికి తాళ్ళుకూడా తెగిపోయాయి. మొండెం నడుస్తూ రణధీరుడి చెంతకు వస్తుంది.

ఆందోళనగా ముఖం పెట్టాడు రణధీరుడు- ఖడ్గంతో చేతుల్ని నరికేశాడు కసిగా రణధీరుడు. మొండెం నేలపై పడిపోయింది- గిలగిల్లాడింది కొంతకాలం- తర్వాత! చలన రహితంగా ఉండిపోయింది.

తెగిపడిన చేతులుకూడా వ్రేళ్ళను ముందుకూ, వెనక్కూ ఆడించి చలన రహితంగా ఉండిపోయాయి. అప్పుడా యువకుడిలో ఎంతటి ఆవేశం ఉందో అర్థమైంది రణధీరుడికి.

పసివాళ్ళూ, పడతులూ ఆ దృశ్యాన్నిచూసి స్పృహ తప్పి పడిపోయారు. ఓ మధ్య వయస్కురాలు కన్నీరు వొదులుతూ- "పాపీ! నా చేతులకున్న బంధాలను విప్పి చూడరా! నిన్నేం చేస్తానో ప్రత్యక్షంగా చవిచూద్దువుగానీ" పండ్లు నూరుతూ ఉగ్రకాళిలా చూసింది.

ఆమె చెంతకు గర్వంగా తలాడిస్తూ వచ్చాడు రణధీరుడు- అతని గుండెలు బండబారిపోయాయి- "ఏం



చేస్తావే వలపులాడి? నాలుగు పదుల వయసున్నా నీలో ఇంకా వేడిరక్తం పొంగిపోతుందంటే నీవు రసికరాణివి- నీలో పొంగే కామాగ్ని ఎలా చల్లార్చుకుంటున్నావే ఇంత కాలం- మధ్య వయసులోవున్నా నా కళ్ళకు మాత్రం ముద్ద మందారంలా కనిపిస్తున్నావే చకోరీ- చ్ప-చ్ప-చ్ప" ఆమె కపాళాలను బలంగా అందుకుని మూడుసార్లు చుంబించాడు.

అప్పుడామె కళ్ళలోంచి కారింది నీరుకాదు ఆవేదన.

అక్కడున్న వారందరూ భయాందోళనలతో ఉన్నారు.

"నీచుడా! సహోదరిలాంటి సౌశీల్యవతిని అవమానించడం తగదు" మరో యువతి కన్నీరు వొదులుతూ పలికింది ఆవేశంగా.

"ఓ....కుందనపు బొమ్మలావున్న నిన్ను వొదిలి నిండు పండులావున్న నీ పొందునువీడి- ముసలిదానితో మురిపాలందుకోవడం మూర్ఖత్వమే మరి. పడుచుతనంతో పాలమీగడ తరగల్లాంటి చెక్కిళ్ళతో బోర్లించిన బంగారు పాత్రసుల్లా ఎగిసిపడే నీ యౌవ్వన వక్షసంపదను చూస్తుంటే కసిగా మీ వాళ్ళందరి కళ్ళముందే కామాయణం సాగించాలని వుందే" అంటూ ఆమె మెడమీదున్న వస్త్రాన్ని కత్తి మొనతో దూరం చేశాడు- ఆమెను ఆశగా చూస్తూ వివస్త్రను చేశాడు.

'థూ' అంటూ ముఖం మీద ఉమ్మేసిందామె.

అతని ముఖమంతా ఎంగిలి పాలనురగలా పడిపోయింది. అయినా బాధపడలేదు. చేత్తో తుడుచుకున్నాడు. ఆమె స్తనాలను గుప్పిళ్ళతో బిగ్గరగా బంధించాడు. స్తన ముచ్చికలను కసితీరా నలిపాడు. చేతుల్ని సున్నితంగా

నిమిరాడు. ఎత్తైన పొత్తికడుపును కుక్కలా నాకాడు.

ఆమె కన్నీరాగలేదు కసితీరా తిడుతుండే తప్ప ఏమీ చేయలేని స్థితిలో వుంది. అక్కడున్నవారంతా ఆ దృశ్యాన్ని చూడలేక కన్నీరు వొదుల్తూ కళ్ళు మూసుకున్నారు.

అప్పటికే రణధీకుడా యువతి దేహాన్ని పూర్తిగా ఆక్రమించుకున్నాడు. ఆమె శరీరాన్నీ శీలాన్నీ పతనం చేశాడు. అలసిపోయేవరకూ ఆమెను వొదల్లేదు- మృగంలా ఉండిపోయాడు. ఆమె ఊపిరి పీల్చడం మానిందా అవమానాన్ని మరువలేక.

అతని కాంక్ష తీరింది.

ఆమె ప్రాణాలు పోయాయి.

అతను వారందరినీ గర్వంగా చూస్తూ- "ఇలా మీకు ప్రతిరోజూ సన్మానం జరుగుతూ వుంటుంది. ఇప్పటికైనా మీ దివ్యానందుణ్ని తపస్సు మానివేయమని ఇక్కడుండే ఆర్తనాదాలు చేయండి. అతను మీ గోడును వింటాడు. తన ధ్యేయాన్ని విరమించుకుంటాడు- లేదంటే.... హ్హా హ్హా హ్హా...." అంటూ అంతర్ధానమయ్యాడు.

క్రూరమృగం వెళ్ళాక ఊపిరి పీల్చుకుంటున్న వన్య మృగాల్లా వారు గాలి పీల్చుకున్నారు తృప్తిగా. ఇంకా వారి హృదయస్పందనలో ఏర్పడిన అలజడి తగ్గలేదు.

అదే సమయంలో!—పుష్పక విమానంలో నూతన వధూవరులైన గంధర్వులు భూలోకయానం చేస్తూ ఆ ప్రాంతంలోనే సంచరిస్తున్నారు.

"యామినీ! ఇటు చూడు. సాగర తరంగాలెంతగా



నయ్యాట లాడుతున్నాయో" యజ్ఞాయన సతికి చూపించాడు.

"అవును నాథా! ఈ లోకమంతా రమ్యంగా వుంది. ఇక్కడే ఎంత కాలమైనా ఉండిపోవాలనిపిస్తుంది. గలగల పారే సెలయేళ్లూ, నాట్యంతో మైమరపించే మయూరాలూ, గంధర్వ గానాన్ని మరిపించే కోకిల కంఠస్వరాలూ.... ఈ ప్రకృతిదేవి ఒడిలో అందంగా ఎదిగిన పర్వతశ్రేణులూ, పచ్చిక బయళ్ళూ-ఆనందంగా ఉందికదూ...."

"ఈ లోకమెంత అందమైనదో.... అంతకంటే విషపూరితమైన మనుషులున్నారు. మానవుల్లో మానవత్వం నశించి. రాక్షసులవుతున్నారు. అందాల అతివలకు రక్షణ లేదిక్కడ- రాక్షసత్వం. కామం క్రోధం. స్వేచ్ఛావిహారం సాగిస్తుందిక్కడ- భూమిపై కాలుపెట్టిన ఎంతటి దైవత్వం కలవారికైనా కష్టాలు తప్పవు. కలలో కూడా ఇక్కడనుండి పోవాలని ఆశించకు దేవీ!" అన్నాడు ఆవేదన స్వరంతో.

"ఏమిటి మీరంటున్నది? ఇదంతా నమ్మశక్యం కాకుండా వుంది. మానవులు ఎంతో అమాయకులనీ. అజ్ఞానులనీ విన్నాను- వారికి దేవతలంటే ప్రాణమనీ. భక్తి శ్రద్ధలతో గౌరవాభిమానాలతో ఆదరంగా చూస్తారని విన్నాను."

"అదంతా ఒకప్పటి కథ. ప్రస్తుతం మానవులకంటే రాక్షసులెంతో మెరుగు. ఈ విషయంలో నీకింకా సందేహం ఉంటే అదిగో....అటు చూడు....వివస్త్రయై. శీల ప్రాణాలను కోల్పోయిన అందాల ముని కన్య- మానవుడి రాక్షసత్వానికి ఆమెకు నూరేళ్ళు నిండిపోయాయి. అక్కడే వున్న అమాయకులైన బందీలను చూడు- వారి కళ్ళలోని

ఆవేదనను చూడు. తెగిపడిన యువకుడి తలా. నేలకొరిగి ఎలా వికృతంగా చూస్తుందో చూడు....శతవృద్ధుడవి జాలి తలచక నాలికనూ, కళ్ళూ పెకలించి ఘోరణహోమాన్ని సృష్టించిన మనుష్యుల గొప్పతనాన్ని తనివితీరా తిలకించు."

ఆ మాటలు వినలేని యామిని చెవులు మూసుకుంది- అప్రయత్నంగా ఆమె కళ్ళలోంచి కన్నీరు ఉబికుబికి వస్తూంది. వెన్నులోంచి భయం తన్నుకొచ్చింది. గజగజా కంపించిపోయింది. భర్త గుండెలపై తలవాల్చి వాలేసుకుపోయింది.

"నాథా! వారందర్నీ రక్షించాలని వుంది- ఈనా ఒక్క మాటనూ కాదనకండి."

"అలాగే! ఇహపై మనం భూలోకానికి రాకూడదు. ఇది మన వివాహ తొలిరోజులు కనుక! ఈ ఆనంద సమయంలో నీ ముచ్చటను కాదనను" పుష్పక విమానాన్ని ఆశ్రమవాసుల ముందు దించాడు యక్షుడు

దివ్య సంజీవివిద్వారా మృతులైన వారిని పునర్జీవులను చేశాడు. నాలికా, కళ్ళూ పోయిన శతవృద్ధుడికి వాటిని ప్రసాదించాడు.

ఆశ్రమ వాసులందరూ బంధవిముక్తులయ్యారు. వారందరూ ఆ నూతన దంపతుల పాదాలపైపడి కన్నీరు కార్చారు. అప్పటివరకు జరిగిందంతా తిలకించిన భూపాలుడూ నూతన వధూవరులను చూసి నమస్కరించాడు.

"దైవ మూర్తులారా! మీరు చేస్తున్న ఈ సత్కార్య ఫలం జన్మ జన్మలకూ మీ జంటను దివ్యానంద పంటగా



ఉంచుతుంది" అన్నాడు భూపాలుడు ఆనందం నిండిన కళ్ళతో చూస్తూ.

ఆ నవ దంపతులిరువురూ సంతోషంగా ఒకర్నొకరు చూసుకున్నారు.

ఈలోగా రణధీరుడచ్చటికి రానే వచ్చాడు. "వీరందరూ నా బానిసలూ, బంధీలూ, వీరిని పునర్జీవులను చేయడమే కాకుండా బంధ విముక్తులను గావించే అధికారం మీకెవరిచ్చారు?" కనుబొమలు ముడివేస్తూ పలికాడు ఆగ్రహంగా.

"రణధీరా! మానవజన్మ ఎంతో పవిత్రమైనది. అలాంటి పవిత్ర జన్మను పొందిన నీవు దానవుడి కంటే కర్కశంగా ప్రవర్తించడం తగదు- అమాయకులైన ఈ ఆశ్రమవాసులు నీకేపాపం చేశారని వీరినిలా చిత్రహింసకు గురి చేస్తున్నావు. సాటి ఆడది నీ ఆడపడుచు లాంటిది- ఆమె శీల ప్రాణాలతో చెలగాటమాడే హక్కూ, అధికారం ఎవరిచ్చారు నీకు? అలనాడు దానవ చక్రవర్తి అయిన రావణ బ్రహ్మకూడా ఇంతటి దారుణాలకొడి గట్టలేదు. పరమ సాధ్వియైన సీతాదేవిని చెరపట్టాడేగానీ నీలా మృగంలా ప్రవర్తించలేదు" అన్నాడా యక్షుడావేశంగా.

"యక్షవీరా! అధిక ప్రసంగం చాలించి వచ్చినదారి వెళ్ళడం మంచిది. మాతో వైరానికి పూనుకున్నావంటే ముక్కు పచ్చలారని నీ ముద్దుల జీవితం సర్వనాశన మౌతుంది" కోపంగా పలికాడు రణధీరుడు.

"మూర్ఖా! నీ మిడిమిడి మంత్ర మహిమలు నా ముందేమీ చేయజాలవని గుర్తుంచుకో" గంభీరంగా పలికాడు యక్షుడు.

"ఇప్పుడు వీరిని కాపాడావు రేపు వీరిని రక్షించగల వాడెవ్వడూ!"

"వారందరినీ నీవేమీ చేయలేవు- వారి శరీరాలు పవిత్రమైనవి. వారినీ పర్యాయం స్పృశించి చూడు! పర్యవసానం నీవే తెలుసుకుంటావు."

"అలాగా" అంటూ ఓ అడుగు ముందుకేసి ఓ మునీశ్వరుడి గెడ్డం లాగబోయాడు. 'భగభగ' మంటూ అగ్ని జ్వాలలు రణధీరుడి వెంటపడ్డాయి యువతి పాదాలమీద పడి క్షమాభిక్షను వేడుకున్నాడు రణధీరుడు.

"నీవింతటి నీచుడివని నాకు తెలుసు. అందుకే! వారికి తగు రక్షణను ఏర్పాటు చేశాను. నా పాదాలమీద పడినంత మాత్రాన ఆ జ్వాలలు నిన్ను దహించక మానవు- వెళ్ళి నీ వవమానించిన ఆ చెల్లి కాళ్ళపై నీ కన్నీరు వొదులు. పశ్చాత్తాపంతో హృదయపూర్వకంగా నీలోని విష బీజాలను వీడు- అప్పుడే నిన్ను నీవు రక్షించుకున్నవాడివవుతావు."

రణధీరుడా మునికన్య పాదాలమీద పడ్డాడు. నన్ను రక్షించు. అజ్ఞానంతో కరుడుగట్టిన హృదయంతో కర్కశంగా చెల్లిలాంటి నిన్ను తల్లిలాంటి ముని స్త్రీలనూ, శత వృద్ధులనూ, యువకులనూ అవమానించాను. ఇహమీదెన్నడూ మిమ్మల్ని కన్నెత్తికూడా చూడను- నన్ను క్షమించండి" అంటూ కన్నీరు వొదులుతూ వాపోయాడు.

"నీచుడా! నిన్ను క్షమించేంతటి ఉదారగుణం నాలో లేదురా- అయినా, నిన్ను దివ్యానందులవారే సంహరించమన్నారు. పాపీ! ఇహనైనా ముని స్త్రీలకూ, మునీశ్వరు



లకూ దూరంగా వుండి బుద్ధిగా జీనవయాత్ర సాగించు" అందా మునికన్య బాహిగా.

ఆ జ్వాలలు అంతరించాయి. రణధీరుడవమానభారంతో మాయమయ్యాడు. భూపాలుడు ఆనందంగా ఆ నవ దంపతులను సాగనంపాడు. ఆశ్రమవాసులంతా ఆనందంగా మళ్ళీ దైవప్రార్థన చేయాలని ముందుకొచ్చారు.

౦

"అవమానం! భరించలేని అవమానం- మాతా గంగాదేవీ!" ఎన్నిసార్లు ఆమె ముఖ దర్శనంకోసం ప్రయత్నించినా ఆమె ప్రత్యక్షం కావడంలేదు- మూర్ఖంగా తన చేతివేళ్ళను అగ్నిలో వుంచాడు- ఆ వేళ్ళు మాడి మసైపోయాయి.

అయినా ఆమె సాక్షాత్కరించలేదు. ఆమె స్వరం వినిపించింది- "మూర్ఖుడా! ఈనాటితో నీలోవున్న దివ్య మహిమలన్నీ నాశనమయ్యాయి. కలుషితమైన నీ దేహంలో ఆ మంత్రాలకు స్థానంలేదు- ఎన్నిసార్లు హెచ్చరించినా నీలోని కామాగ్నిని చల్లార్చుకోలేకపోయావు- ఇప్పటికే నేనెన్నో అవకాశాలనందించాను నీకు- ఫలితంగా పర్వలోకాల్లో నాకున్న గౌరవ మర్యాదలు సన్నగిల్లాయి. ఇహ నీకీ జన్మలో ఎలాంటి సాయం చేయను- నీ పాప ఫలాన్ని నీవే అనుభవించు. ఇప్పుడు నీవు అతి సామాన్యుడవని మరువకు- మందాకినిపై వున్న వ్యామోహాన్ని చంపుకుని దివ్యానందుడి శరణు వేడుకో- నీ రాజ్యం నీ

కెలాగూ దక్కదు. కనీసం ప్రాణాలైనా మిగుల్చుకున్న వాడివవుతావు" అంది కోపంగా.

"మాతా! నాలో చల్లారుతున్న క్రోధ జ్వాలల్ని రెచ్చగొట్టింది మీరే. దివ్యానందుణ్ని హీనాతిహీనంగా చూడమని నాకు మహిమలను ప్రసాదించింది మీరే. అప్పుడే నీవు కూడా నాకు దూరమైపోతే నా గతి ఏం కావాలి తల్లీ. నీ కారణంగా నా రాజ్యాన్ని కోల్పోయాను. ప్రాణప్రదంగా ప్రేమించిన మోహినికూడా నా పాలిటి విషసర్పంగా మారింది. అందరికీ నేను శత్రువునయ్యాను. నన్ను నడి సంద్రంలో నావవిడిచి నీవు మెల్లగా జారుకోవడం న్యాయంగా వుందా తల్లీ...."

"మూఢా! న్యాయాన్యాయాలను గూర్చి నాకు బోధించేంతటి వాడివయ్యావా? అలనాడు దివ్యానందుడు ఏ పాపం తెలీని అమాయకుల ప్రాణాలు నిలపడానికి నిస్వార్థ హృదయంతో నన్ను శపించాడు. నీవు ప్రతిక్షణం కామం రగిలిన కళ్ళతో కనిపించిన కాంత శీల మాన ప్రాణాలను హరించి, నిజ ధర్మాన్ని విస్మరించావు. దివ్యానందుడు నాకేమీ శత్రువు కాదు. అతడు నన్ను క్షమార్పణ వేడుకున్నా నేనే కర్కశ హృదయముతో అతనిపై కక్ష సాధించినందుకు సిగ్గుపడుతున్నాను."

"అంతేనంటావా మాతా!" అన్నాడు బాధగా.

"అవును. నా నిర్ణయానికి తిరుగులేదు. ఇప్పుడీ గుహ ప్రభావంకూడా ఏమీలేదు. ఎవ్వరైనా నిర్భయంగా రావొచ్చు" అంటూ కైలాసానికెళ్ళిపోయింది.

రణధీరుడు భారంగా కణతలు పట్టుకున్నాడు. వ్యూహం



పని విధంగా గంగాదేవి తననుండి వేరైపోయింది. కనుక! దివ్యానందుణ్ని క్షమాభిక్ష వేడుటకంటే అన్యమార్గం కనిపించడంలేదు.

ఇన్నాళ్ళూ ఎన్నెన్నో ఆశలు పెంచుకున్నాడు. ఈ స్త్రీ వ్యామోహంతో తనెంత నష్టపోయాడో ఇప్పటికర్థమయిందతనికి.... వళ్ళంతా ఎవరో పదునైన కత్తులతో పొడుస్తున్నట్లుంది. ఉన్నట్లుండి దిగున తలతిప్పి చూశాడు.

చాటుగా, అర్ధనగ్నంగా విరహవేదనతో చూస్తుందొకతని పొందుకోసం ఓ మగువ. ఆమె అతని పరిచారిక. అప్పుడా సమయంలో ఆమె కళ్ళలో మత్తు పొంగిపోతుంది. గుండెలమీది కండలు అవురావురు మంటున్నాయి అధరాలు మెల్లగా కంపించి పోతున్నాయి. ఆమె చూపులు పదునైన మన్మథ బాణాల్లా వున్నాయి.

అయినా, అతనికెందుకో ఉత్సాహం రావడంలేదు.

ఆమె మెల్లిగా వచ్చి అతని ఒడిలో కూర్చుంది కైపుగా చూస్తూ. "ఇవాళెందుకో తమరు పరధ్యానంగా వున్నారు. నేనిక్కడికి రావడం ఆలశ్యమయిందని కోపంగా ఉన్నారా?" అతన్ని చేతులి గుండెలమీదుంచుకుని. "ఇవి నీ తాకిడిలేక తల్లడిల్లి పోతున్నాయి. ఇటు చూడు! నా యౌవ్వన పుష్పం నీ తియ్యని మకరంద సుఖవర్షంకోసం ఎంతగా పరితపిస్తుందో. అందిన ఆడదాన్ని ఆనందంగా అందుకోకుండా ఆలశ్యం చేస్తావేమిటి?" మత్తు స్వరంతో అంది.

వికారంగా ఒళ్ళు విరుచుకుని తన ముఖాన్ని అతని మగసిరికి దాసోహం చేసింది. ఆమె పెదాలు అక్కడేదో

చలిపిగా కదలుతున్నాయి. అతనిలోని బాధంతా కరిగిపోయింది. అతనిలో ప్రేరణ కలిగింది. ఆమె తలను బలంగా అదిమాడు.

ఆమె మరింత ఆనందంగా పెదాలను స్పృశిస్తూనే వుంది

ఆమెను శయ్యపై పడుకోబెట్టాడు మన్మధుడిలా ఆమెపై విజృంభించాడు. ఆమె మెత్తగా, పూవులా నలిగి అలిసిపోయింది. ఆనపురిచి తృప్తిగా నిద్రిస్తూ వుంది. ఆమెను కత్తితో హత్య చేశాడు. 'కెవ్'న అరిచింది.

కసిగా అతని కత్తి ఆమె గుండెల్లో దిగుతూనే వుంది.

చిందిన వేడి రక్తంతో అతని ముఖమంతా తడిసింది.

ఆమె ప్రాణాలు గగన విహారం చేశాయి.

రణధీరుడింకా ఏవో యోచిస్తున్నాడు

అప్పుడే ఆ మందిరంలో మోహిని ప్రవేశించింది. ఆ శవాన్ని చూసి నివ్వెరపోయింది. రణధీరుడామెను చూశాడు. తప్పుచేసిన వాడిలా తలొంచుకున్నాడు. ఆమె అతన్ని సూటిగా చూస్తోంది. అతనామెకు ముఖం చూపించలేక పోతున్నాడు

"నిన్ను నమ్ముకున్న వారందరినీ ఇలాగే నాశనం చేస్తే చివరకు నీకు మిగిలేదు ఎవ్వరు! ఎందరితో నీవిలా నమ్మకంగా వుంటూ వారి జీవితాలను సర్వనాశనం చేస్తున్నావు! ఈ పరిచారిక నీకేం ద్రోహం చేసిందని ఆమెను ఇంత నిర్దయతో సంహరించావు! నీవు బాధతో వున్నందుకు తన శరీరంతో నిన్ను సుఖపెట్టినందుకేనా ఆమెకీ నాడీ శిక్షను విధించావు? ఆమె గురించేవి చెప్పిందంతా వినిం



తనేగా నీవు ఆమెను చంపావు? ఏదీ నీకు కీడును తలపెట్టేదయివుంటే, ఈ పాటికీ రహస్యాన్ని అందరికీ చాటి చెప్పక నీ పొందు కోసం తనెందుకెదురు చూపింది. హూ! ఆ మాత్రం విచక్షణా జ్ఞానంలేక మూర్ఖత్వంతో ఓ నిండు జీవితాన్ని బలిచేశావు. ఇప్పుడా రహస్యం నాకూ తెలిసిందిగా! నన్ను సంహరించగలవా? నీలో ఎంతో మార్పు వచ్చిందని ఆనందించే సమయంలో నీవిలా ప్రవర్తించడం బాధగా వుంది."

ఆమె దూరంగా జరిగి అతన్ని తీవ్రంగా చూస్తూ "అయితే నీకు నిజంగా మందాకినిపై వ్యామోహం లేదన్న మాట" అడిగింది సూటిగా.

అతను చుబుకాన్ని చేత్తో మర్దించుకుంటూ ఆలోచించే వాడిలా ముఖం పెట్టి పైకి లేచాడు. కొంత సమయం గడిచాక "నిజంగా ఆమెపై నా కెలాంటి వ్యామోహంలేదు" అన్నాడు బాధగా.

"నీ మాటలు విశ్వసించవచ్చునా!" సందేహాన్ని వ్యక్తం చేసిందామె.

"నా రాజ్యమెలాగూ పోయింది. మిగిలింది ప్రాణాలే. సర్వశక్తులను కోల్పోయిన నేను దివ్యానందుడి చేతుల్లో చావడంకంటే ప్రాణాలతో బ్రతకడం ఉత్తమం అనుకుంటున్నాను. అందుకే మనసును మార్చుకుని ఆ మహానుభావుడ్ని క్షమాభిక్షను ప్రసాదించమని అర్థించాలనుకుంటున్నాను."

"నిజంగానే నీ మనసు పరిణామం పొందిందా? అయితే నా మనసును కూడా మార్చుకుంటున్నాను. అందరం ఆనందంగా వుండిపోదాము. దివ్యానందులవారు నిన్ను క్షమించగలరు. కాశ్యపరాజ్యంలోనే మంత్రి పదవి మీకే అర్పించగలరు. వస్తాను...." ఆగి "ఈ రాత్రే నేనీ విషయాన్ని మహారాణి మందాకినిగారితో చెపుతాను. ఆమె కూడా ఎంతో సంతోషిస్తుందీ వార్త విని" అంటూ వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన తర్వాత తృప్తిగా సురాపానం పుచ్చుకున్నాడు రణధీరుడు.

○ ○ ○

అర్ధరాత్రి కావొస్తూంది!

దివ్యానందుడి ప్రాణాలు అంతిమదశలో వున్నాయి. అతని ఆత్మ జ్యోతిగా మారి రెపరెపలాడుతూ వుంది. ఆ జ్యోతి హరినామ స్మరణ చేస్తూ వైకుంఠానికి పయనించింది.

శేషశయ్య మీద శయనించిన ఆదివిష్ణు ఆ జ్యోతిని చూసి విస్మయుడయ్యాడు. వెంటనే అక్కడ్నుంచి అంతర్ధానమయ్యాడు.

ఆదిలక్ష్మి ఆందోళనగా ముఖం పెట్టింది.

"వత్సా! దివ్యానందా! నీ ఘోరతపస్సుకు సంతసించాను. నీ అభీష్టం నెరవేరును. నీవు కళింగను చేరునరికి నీ సతీపుత్రులు అచ్చట సాక్షాత్కరిస్తారు. నీ తపస్సును వీడి ఆనందంగా నీ రాజ్యానికి తరలివెళ్ళు. నీవిక నిశ్చింతగా వుండవొచ్చు. ఇదిగో స్వీకరించుము! ఈ



దివ్యమైనది పుష్పం అక్షయపాత్రలాంటిది. దీని ప్రభావంతో సుఖానందాలను ఎందరికయినా పంచిపెట్టవచ్చు. ఈ పుష్పమహిమలతో ప్రజలందరికీ సుఖశాంతులను ప్రసాదించవొచ్చు. ఎవరికేమి అవసరమో అది వెంటనే తీర్చగలదు" అంటూ ఆ పుష్పాన్ని అందించి, ఆశీర్వదించి మాయమైపోయాడు విష్ణుమూర్తి.

దివ్యానందుడానందంగా ముందుకెళ్ళాడు.

ఆశ్రమవాసులందరూ ఆనందంతో ఆయన్ను చేరారు.

○ ○ ○

పరుగులు తీస్తున్నారు మందాకినీ, మోహినీలు. మందాకిని పొత్తిళ్ళలో పసివాడు శోకరాగాలు తీస్తున్నాడు. ఆమె పాదాలు పుష్పాలకంటే ఎంతో సున్నితమైనవి. ఆమె పాదాల్లో ములుకుల్లాంటి రాళ్ళు కసుక్కున దిగబడుతున్నాయి. ఆమె కళ్ళలోంచి అశ్రువులు ఉధృతంగా ప్రవహిస్తూ గుండెల మీద నుంచి జారిపోతున్నాయి. ఆమె పాదాల్లోంచి రక్తం స్రవిస్తుంది. బాధతో సుడులు తిరిగిపోతుందామె.

ఎక్కడ్నుంచో ఓ గాలికెరటం దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయిందామెపై.

మోహినిలో ఆందోళన అధికమయ్యింది. పరిచారికలు వెంటాడుతూనే వున్నారు. తనూ వొదిలిన బాణంలా పరిగెడుతూనే వుంది. మందాకినీ మోహినిలు వేరయ్యారు.

మోహిన్ని పరిచారికలు పట్టుకున్నారు. వారామె చేతుల్ని మెలివేసి గుహవైపు ఈడ్చుకెళుతున్నారు. వారి నెదిరించే శక్తి ఆమెలోలేదు.

పసివాడు ఏడుస్తున్నాడు. ఆమె గొంతులో తడారి పోతుంది. కళ్ళు నీళ్ళకోసం వెదుకుతున్నాయి. మధ్య మధ్యన ఆపుతూ ఏడుస్తున్నాడు పిల్లవాడు. నీళ్ళు లేవు కానీ దూరాన దుమ్ము రేపుతూ ముందుకు దూసుకు వస్తుంది బలిసిన చిరుతపులి.

ఆమె దెబ్బతిన్న పక్షిలా విలవిల్లాడిపోతుంది.

ఆ పసికందు ఏడుపింకా తారాస్థాయికి చేరింది!

చిరుత అడుగులో అడుగు ముందుకేస్తుంది.

ఆమె చావడం ఖాయమనుకుంది. తన పతిదేవుడిని వేడుకుంది. అంతే!

జ్వాలలతో కూడిన అగ్నిశిఖరాలు వెంబడించాయి చిరుతను.

ఆమె బిడ్డడి వైపూ, జ్వాలల వైపూ మార్చి మార్చి చూసింది.

అదే సమయంలో ఆకాశంలోంచి పుష్పక విమానం రానే వచ్చింది.

మందాకిని పరుగున వెళ్ళికూర్చుంది పుత్రుడితోబాటు.

మరుక్షణమే గగన విహారం సాగిస్తూ వుందా పుష్పక విమానం.

* *

ఆకలిగొన్న మృగంలా మోహిన్ని చూశాడు రణధీరుడు. ఆమె చలించలేదు. పరిచారికలాతనికి మధువు నందిస్తూ వున్నారు. "పారిపోవడానికి ఎందుకు పథకం వేశావు!" భీకరంగా ప్రశ్నించాడు రణధీరుడు.

"నీ మనసు మార్చుకున్నావని చెప్పావు కనుక!"



ధైర్యంగా సమాధానం చెప్పిందామె.

"ప్రశ్నకు ప్రశ్న సమాధానంకాదు. నా లక్ష్యాన్ని నిర్లక్ష్యం చేసినందులకు నిన్ను ఉరికే వొదలను" క్రోధంగా అంటూ కత్తిని పైకి తీశాడు. వెంటనే ఆమె తలనూ చేతులనూ, కాళ్ళనూ ముక్కలు ముక్కలుగా నరికాడు.

ఆనందంగా నవ్వుకున్నాడు. మధువును దిత్తుగా తాగాడు.

o o o

"మోహిని మీతో రాలేదా!" అప్పుడే పుష్పక విమానం దిగుతున్న మందాకిన్ని ఆతృతగా ప్రశ్నించాడు భూపాలుడు.

ఆమె బాధగా జరిగిందంతా చెప్పింది.

అదే సమయంలో ఆనందంగా దివ్యానందుడామెకు ఎదురొచ్చాడు.

చెలికత్తెలు తల్లీబిడ్డలకు దిష్టితీశారు. ఆమెను స్వాగతం పలుకుతూ అందంగా నాట్యం చేస్తూ ఆమెనులోనికి నడిపించుకెళ్ళారు. దివ్యానందుడిలో ఏదో నవ్యానందం పొంగి పొర్లుతోంది. బిడ్డను చూడాలన్న తపన అతనిలో అధికమయ్యింది.

అంతఃపురంలోకి ఆమె రాగానే పుత్రుడ్ని చేతుల్లోకి తీసుకున్నాడు. నిండుచందమామలా అందంగా కనిపించే బాలుడ్ని తనివితీరా గుండెలకు హత్తుకున్నాడు. ముద్దులతో ముఖమంతా తడిచేశాడు. మందాకిని అతనిలోని తండ్రి, ఆనందాన్ని తదేకంగా చూస్తూ మురిసిపోతోంది.

అదే సమయంలో భటులచటికివచ్చి ఆయనకు నమస్కరించారు. ఆయన వారిని ప్రశ్నార్థకంగా చూశాడు.

"ప్రభువులు క్షమించాలి. మీ కోసం రణధీరుడో కానుక నమర్పించాడు" అన్నాడో భటుడు వినయపూర్వకంగా.

"పదండి చూద్దాం!" సంశయంగానే వారితో వెళ్ళాడు దివ్యానందుడు.

ఆరడుగుల పెట్టెలో అందాలు చిందే మోహిని మృతరూపం వికృతంగా ముక్కలు చెక్కలుగా కనిపించింది. విస్మయుడయ్యాడు దివ్యానందుడు. అక్కడున్న భటులు కూడా ఆందోళనగా వుండిపోయారు.

ఈలోగా భూపాలుడక్కడికి రానేవచ్చాడు. "స్వామీ! నేను మోహిన్ని రక్షించడానికెళ్ళాలి. తమరు ఆశీర్వదిస్తే ఆనందంగా వెళతాను" అన్నాడు వినయంగా.

ఆ మాటలకు దివ్యానందుడి కళ్ళు చెమ్మగిల్లాయి. మౌనంగా వుండిపోయాడు. భూపాలుడు ఆశ్చర్యంగా దివ్యానందుడి వదనాన్నే తదేకంగా చూశాడు. దివ్యానందుడు శవం మీదున్న లేఖను భూపాలుడికి కప్పగించాడు.

భూపాలుడా లేఖను చదువుతున్నాడు:

"దివ్యానందులకూ, భూపాలుడికీ! రణధీరుడు వ్రాయుట ఏమనగా మందాకిని తన పుత్రుడితోబాటు ఈ పాటికి కళింగను చేరి వుంటుంది. మీరంతా ఆనందించే ఈ శుభ సమయంలో మీకో కానుక పంపిస్తున్నాను. మోహిన్ని శవంగా మార్చి, ముక్కలు ముక్కలుగా నరికి మీకందిస్తున్నాను. ఈ కానుకతో మీ రెంతో ఆనందిస్తారని తలుస్తున్నాను. అంతేకాదు! నా రాజ్యాన్ని నా కందించే వరకూ నేను



నిద్రించను. మందాకినిపై ఆమె పుత్రుడిపై పగబడుతాను. వారిరువుర్నీ సర్వనాశనం చేస్తాను. అప్పుడే నా మనసుకు శాంతి. ఇట్లు, మీ శత్రురాజు, రణధీరుడు" అని వుందా లేఖలో.

భూపాలుడి గుండెలు చలించాయి. మోహిని శవాన్ని చూశాడు. అతని క్రోధం చెలరేగింది జ్వాలలా. "ఆ నీచుడ్ని సమయంలోనే సంహరిస్తాను" ముందుకు కదిలాడు ఆవేశంగా.

దివ్యానందుడాతని భుజాన్నందుకుని "తొందరపడకు భూపాలా! వాడి ప్రాణాలు తీయడానికి నీకా శ్రమ అక్కరలేదు. మోహినీ చేతుల్లో వాడి చావు వ్రాసి వుంది. అటు చూడూ! నీ మోహిని చావలేదు. సజీవంగా వుంది. ఆమె పక్షాన న్యాయదేవతతోబాటు పార్వతీదేవి వాక్కు నిలిచి వుంది. ముక్కలైన దేహమంతా ఒక్కసారిగా ఎంతటి శోభతో వుందో చూడు" అన్నాడు.

ఆమె ప్రశాంతంగా నిద్రించినదానిలా లేచింది. అక్కడున్న వారందరినీ చూసింది. భూపాలుడ్ని చూడగానే ఆమె హృదయం ఆనందంతో పరవశించింది. వెంటనే లేచి అతని గుండెలపై వాలిపోయింది.

భూపాలుడిలోని బాధంతా మాయమయ్యింది.

దివ్యానందుడూ భటులూ వారిరువుర్నీ చూసి ఆనందంగా ముందుకెళ్ళారు.

రాజ్యమంతా ఆ రోజు కన్నుల పంటగా వుంది.

0 0 0

తన కన్నకూతురూ, మనుమడూ క్షేమంగా కళింగను

చేసుకున్నారన్న వార్త విన్నాక వసంతుడికున్న మనో
వ్యధంతా తీరిపోయింది. మంత్రి జనంతుడా సమయంలో
అక్కడే వున్నాడు. "ఆలయంలోని దేవుడుకి యిన్ని
రోజులకు కరుణ కలిగింది మంత్రివర్యా! ఈ శుభ సంద
ర్భాన పేదప్రజలందరికీ అన్నదానం వస్త్రదానం చేయండి"
అన్నాడు ఆనందంగా.

జనంతుడు వెంటనే వాటిని అమలు పరిచాడు

ప్రజలంతా ఆ రోజు పండుగ చేసుకున్నారు. పుర
వీధులన్నీ రంగురంగుల తోరణాలతో అలంకరించారు.
ప్రతి ఇంటి ముందు కలాపి చల్లి అందాలు చిందే ముత్యాల
ముగ్గులతో సింగారించారు రమణీమణులు.

అన్ని దేవాలయాలలో దీపకాంతులూ, అర్చనారాధ
నలూ, భక్తిగీతాలూ, హరికథా కాలక్షేపాలూ చకచకా
జరిగిపోతున్నాయి వయసొచ్చిన ఆడపిల్లలు ఆనందంతో
చెమ్మ చెక్కలాడుతున్నారు. యువకులు దీపావళి బాణ
సంచారాన్ని రంజింపచేస్తున్నారు. ముత్తయిదువులంతా
దీపాలంకరణ చక్కగా గావిస్తున్నారు.

పసివారూ, వృద్ధులూ బోసినవ్వులతో కళకళలాడిపోతు
న్నారు.

ఆ వేడుకను శివపార్వతులిరువురూ తిలకించారు ఆనం
దంగా.

"చూశావా దేవీ! దివ్యానందుడు తన రాజ్యంలో
లేకున్నా ప్రజలంతా ఆనందంగా పండుగ జరుపుకుంటు
న్నారు. ఆ నాడు నేను దివ్యానందుడ్ని అర్థంచేసుకోలేదు.
అతనిపై కోపించి శివతాండవమాడాను. కోపించి శపించి



వుండి వుంటే ఈ నాడు మనమీ పండుగను తిలకించి
వుండేవారిమే కాదు" అన్నాడు నాగాభరణుడు

"అవును స్వామీ! సకల దేవతలంతా అతనికి ఒకటే.
శివానందులకే అన్ని దేవాలయాల్లో దీపారాధనలు జరుగు
తున్నాయి స్వామీ! దివ్యానందుడి కష్టాలన్నీ యిక
గట్టెక్కినట్లేనా!" సందేహంగా చూపింది ఉమాదేవి.

"దేవీ! భక్తులకు కష్టాలు రావడం సహజం. కష్టాలు
అతని మంచికే జరిగాయి. ఆనాడు నీవతడిని రాజావి
చేశావు. ఒక్కసారి సాధుస్వభావుడిగా వున్న దివ్యానం
దుడు నృపుడై త్రిపుర రాజ్యాధినేతగా రాజ్యభారాన్ని
వహించి, సుఖసంతోషాలతో వుండటం మంచిది కాదు.
రాజవంశీయుల మనస్తత్వాలూ. ప్రజల గుణగణాలూ
తెలుసుకుని వాటిని సమయస్ఫూర్తిగా వినియోగించుకో
వాల్సిన అవసరాన్ని తెలియజేయుటకొరకే నేను గంగా
దేవిని వారించలేకపోయాను. ఆమె కూడా ఇప్పుడు దివ్యా
నందుడి పక్షానే చేరింది. ఇక మీదట అతనికి ఎలాంటి
ఆపదలు కలుగవు నీవాతనికి అందించిన వరాలన్నీ సఫలీ
కృతమౌతాయి" సంతోషాన్ని వ్యక్తం చేశాడు గిరిజా
వందుడు.

"అంతటి ద్రోహియైన రణధీరుడ్ని సంహరించేందుకు
దివ్యానందుడిలో అన్ని శక్తులున్నా యింకా ఎందుకు విని
యోగించుకోలేదో...." సందేహంగా పలికింది.

"నీకు తెలియనిదేమున్నది దేవీ! దివ్యానందుడు సామా
న్యుడు కాడు. తపశ్శాలియే కాదు- విజ్ఞాని కూడా ఎవరి
కారణంగా మోహిని వంచించబడిందో, వారిని మోహినే

సంహరించగలదు. అప్పుడే మరిచితివా దేవీ! అలనాడు నీవే ఆమెకా వరాన్ని ప్రసాదించావు" చిరునవ్వు ముఖంతో చూశాడాయన.

"అంతా మీ లీల! మానవుల పుణ్య, పాపకార్యాలు జరిపించేది జరిపేదీ సకలం మీరేనని తెలిసి కూడా యింకా సందేహాలు వ్యక్తం చేయడం ఉచితంకాదు నాకు స్వామీ. నీకు తెలియనిదేదీలేదు. దుష్టశిక్షణా శిష్టరక్షణా కాదా లన్నీ నీవే భరిస్తున్నావు. అజ్ఞానంగా ప్రశ్నించి మీ అంతర్యాన్ని తెలుసుకోనందుకు నన్ను క్షమించండి" అంది కాస్త బాధగా.

"దేవీ! ఇహ ఈ ముచ్చట తీరింది. కైలాసాని కెళదామా?" ఆమె మృదువైన భుజం చుట్టూ చేతులు వేసి ప్రియంగా అడిగాడు. ఆమె సిగ్గునభినయిస్తూ పతి దేవుని గుండెలపై గువ్వలా తలవాల్చింది.

○ ○ ○

"ఇంకా ఏముందని ఈ రణధీరుడిపై మనం కాంక్షలు పెట్టుకోవాలి?"

"రాజ్యంపోయింది, ప్రియురాలుపోయింది."

"ఆ మూర్ఖుడ్ని నమ్ముకుని మనం సర్వస్వం అందించాము."

"దివ్యానందుడి శరణు వేడుకుని అంతఃపురంలో ఉద్యోగం చేయడం ఉత్తమం. రండే.... ఇంకా ఆలస్యం చేయడం తగదు" ఆ పలుగురు పరిచారికల మాటలూ పదునైన కత్తుల్లా రణధీరుడి గుండెల్లో దిగినాయి.

అయినా ఇంకా చాటుగా వుండి వింటున్నాడు.



వారంతా అతన్ని విమర్శిస్తూ ఏవేవో మాటలు మాట్లాడుకున్నారు.

కత్తిని పైకి తీశాడు. వారి ముందుకొచ్చాడు ఆగ్రహంగా

అతని ఉగ్రరూపం చూసే సరికి చలించిపోయారువారు.

"మీరు కూడా నన్ను దూరం చేసుకుంటున్నారన్న మాట. మీ రక్తంలో కూడా స్వార్థబీజాలు చిగురించాయన్నమాట. మీరంతా నాకు వ్యతిరేకులై పోతున్నారా! వెళ్ళండి... ఆ స్త్రీ, అధికారం వుంటేనే ఆదరి మగాడిని వెతుక్కుంటూ వస్తుంది. అది కోల్పోయిననాడు తాము నమ్ముకున్న మగాడిని విమర్శించీ, ఎంతటి ద్రోహానికైనా వొడిగడుతుందన్న నగ్నసత్యం మీ ద్వారే తెలుసుకున్నాను.... విషసర్పాలకంటే భయంకరమైన మీ శరీరాలను ముక్కలు ముక్కలుగా నరకగలను" కత్తిని పైకెత్తాడు కోపంగా.

అతని రెండు చేతుల్లో రెండుబాణాలు దిగబడాయి. అతని చేతుల్లోని కత్తి నేల మీద 'ఠంగ్' మంది. వణుకుతున్న చేతులతో, పళ్ళు నూరుతూ ఇటు తిరిగి చూశాడు. ఎదురుగా మృత్యుదేవతలా కనిపించింది మోహినీ ఆకారం. విస్మయుడయ్యాడు! చనిపోయిన మోహిని సజీవురాలెలా అయ్యింది?

"దుర్మార్గురాలా! చాటు నుండి వెన్నుపోటు పొడుస్తావా?" అతని స్వరంలో కోపంతోబాటు వేదన కూడా లేకపోలేదు.

"ఒకే ఒక్కసారి నేను నిన్ను చాటు నుండి చాపు

దెబ్బలు కొట్టాను. కానీ నీవూ? నా జీవితాన్ని ఎన్ని పాళ్లు చంపి, నరకయాతన చేశావో నా కంటే బాగుగా నీకు తెలుసు" అంది తీవ్రంగా తలాడిస్తూ.

"రాక్షసీ.... నిన్ను ప్రాణాలతో వదలను" ఆమె మీదికి రాబోయాడు. 'సక్ సక్' మనిపించిందాతని రెండు చేతుల్నీ భుజాల వరకూ పొరకాయల్లా తెగి చలించి తల్లడిల్లి జీవరహితంగా వుండిపోయాయాతని చేతులు.

బుసలుకొట్టే కోడెనాగులా ఆమె, చావు కోసం ఎదురు చూసే నిరాశజీవిలా అతను. ఆయాసంతో బాధతో నుదులు తిరిగిపోతున్నాయి. అతని ముఖమంతా స్వేదంతో తడిసి ముద్దయ్యింది. ఆ సమయంలో దాహం- దాహం అంటూ కేకలేశాడు.

అయినా ఆమె అతనిపై జాలిపడలేదు. అతని రెండు కాళ్ళను కూడా నరికింది. అతను కుప్పలా కూలాడు. దగ్గరగా చావుకేకలు పెడుతున్నాడు. ఎవ్వరికీ అతనిపై జాలివేయులేదు. విషసర్పాన్ని కరుణించి గాయాలు మాన్పితే అది శక్తిని కూడగట్టుకున్న తర్వాత తననే కాటువేస్తుందని వారందరికీ అనుభవపూర్వకంగా తెలుసు.

"మోహినీ! ఇంతటితో నన్నొదులూ. కాళ్ళూ, చేతులూ కోల్పోయాను. నాకు ప్రాణభిక్షను ప్రసాదించు" ఏడుస్తూ, అర్థింపుగా చూశాడాతను.

"వదలను. నిన్ను ప్రాణాలతో వదిలితే ఏం జరుగుతుందో నాకు బాగా తెలుసు. అపాయాన్ని తప్పించుకున్న కాలనాగు ఏం చేస్తుందో నీవూ అదే పని చేస్తావు



కనుక నిన్ను సంహరించకపోతే, సర్వలోకాలకే ముప్పు వాటిల్లుతుంది" రుద్రకాళిలా విజృంభించిందామె.

అతని శిరస్సును ఖండించింది. అది దొర్లుతూ ఆమె పాదాలపై పడింది. అప్పుడే అంచెలంచెలుగా క్రోధం తగ్గిందామెలో. ఆ తర్వాత అందరూ కలిసి కళింగను చేరుకున్నారు. పరిచారికల ప్రాణాలను కాపాడినందుకు వారంతా మోహిని పాదాలకు నమస్కరించారు.

దివ్యానందుడు ఆనందంగా మందాకినీ, తన పుత్రుడు మాధవుడితోబాటు త్రిపురకు బయల్దేరాడు. కళింగను మోహినీ భూపాలుడికప్పగించి.

మోహినిని గాఢంగా పెనవేసుకుపోయాడు భూపాలుడు.

ఎంతకాలం పొందిన వియోగమంతా ఒక్కసారి భరించరాని విరహంగా మారింది. అందుకే కాలంతో నిమిత్తం లేకుండా వారిరువురి శరీరాలు కమ్మని సుఖలోకాల్లో మునిగి తేలుతూ, అలసిపోతూ, పరితపిస్తూ వున్నాయి.

o o o

దివ్యానందుడు సతీపుత్రులతోబాటు త్రిపురకొస్తున్నాడని తెలిసిన వసంతుడి రుగ్మతంతా మాయమైపోయింది. హుషారుగా శయ్యమీంచిలేచి కొత్త దుస్తులు ధరించాడు. మంత్రి జయంతుణ్ని పిలిచి ఘనస్వాగతానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చకచకా చేయించాడు.

వసంతుడి ఉత్సాహానికి రాజవైద్యులంతా ముక్కుపై వేలుంచుకుని విస్మయంగా చూస్తున్నారు.

ప్రజలందరూ తమ ప్రభువునూ, మందాకినినీ, మాధవుణ్ని చూడాలని తండోపతండాలుగా వచ్చారు. రథం

రాజధాని పురవీథుల్లోకి వచ్చేసింది. అభిమానవర్షంతోబాటు అనురాగపుష్పాలు కూడా వారిపై కురిపించారు ప్రజలు. ఆనందంగా రథం ముందుకు సాగిపోతుంది.

జానకీరాముడిలా వున్న ఆ జంటను అందరూ మెచ్చుకుగా చూస్తున్నారు.

వసంతుడూ, జసంతుడూ వారికెదురు వెళ్ళారు.

వసంతుడు మందాకిన్ని నవ్వుతూ పరామర్శించి ముద్దుల మనుమడ్ని ఎత్తుకుని శతకోటి ముద్దులు కురిపించాడు.

అందరికీ ఆ రోజు విందులా వుంది! వారిరాక సందర్భంగా తండోపతండాలుగా విచ్చేసిన ప్రజలందరికీ విందు ఏర్పాటు చేశాడు వసంతుడు.

విందుభోజనాలు ముగిశాక ప్రజలంతా ఎవరెవరిళ్ళకు వారెళ్ళారు.

సిందుజాబిలిలా శోభించే మందాకిని చటుక్కున లాక్కున్నాడు దివ్యానందుడు. ఆ శయ్యపైనున్న మల్లెలు తియ్యగా నలిగిపోతూనే వారిరువురి శృంగారానుభూతులను గమనిస్తూ వున్నాయి.

నవ్వులతో ఆ రాత్రి ప్రణయశృంగార రాత్రిగా మధురాతి మధురంగా గడిచిపోతుంటే, శీతాంశుడెందుకో నన్ను గిల్లిపోతున్నాడు బాధగా.

—: శుభం :—